# *Great Learning opportunity....*
## *Training on new generation*
# CAD/CAM/CAE
# Technologies - CATIA V5

## OBJECTIVE:

In this course you will learn state of the art cutting edge leading technologies in CAD CAE - CATIA V5. At the end of the course you will be in a great demand to start your career in automotive, Aerospace & other MNCs

## PARTICIPANT PROFILE:

Engineering / Polytechnic students and professionals with Mechanical, Civil & Electrical backgrounds

## COURSE CONTENTS:

1. CATIA Basics & Tools
2. Sketcher
3. Part Design basics & advanced (Solid)
4. Shape Design basics & advanced (Surface)
5. Generative & Interactive Drafting
6. Structural Design
7. Sheetmetal Design
8. Knowledgeware
9. FEM & Kinematic Analysis

## SALIENT FEATURES:

- Well-qualified experienced engineers trained by IBM Consultants.
- Visiting faculty from leading Auto & Aerospace Multi national companies.
- Latest workstations with Pentium 4, 256MB RAM 32MB V RAM, 17" Color Monitor etc.
- Flexi lab timings
- Exposure to live and practical projects
- Placement Assistance.

Gama Solutions Inc. is a subsidiary of Guru Information Solutions USA, formed with an aim to provide world class services in CAD/PDM areas to both domestic and international customers

***: For further details please contact :***

**GAMA SOLUTIONS INC.**

**Plot No – 9, Krishna Priya Apartments, Flat No. 201**
**Hare Krishna Road, TIRUPATHI.**

ఉత్తమ గ్రం

సంపాదక వర్గము:

విద్యావాచస్పతి, కవిసార్వభౌమ,
మహోపాధ్యాయ, సాహిత్యాచార్య,
సాహిత్యసమ్రాట్, కవీంద్ర
స్వామి శివ శంకర శాస్త్రి

కవిసమ్రాట్, కవిమార్తాండ
నోరి నరసింహ శాస్త్రి, బి. ఏ., బి. ఎల్.

సాహిత్య సుధాకర (హిందీ)
తల్లావఝ్ఝల కృత్తివాస తీర్థులు
ఎం. ఏ (సంస్కృత)., ఎం. ఏ (చరిత్రాది)., బి. ఇడి.

*

జాతక కథలు : ఏడు సంపుటములు
ప్రథమ సంపుటి : పది రూపాయలు
ద్వితీయ సంపుటి : పది రూపాయలు
తృతీయ సంపుటి : పది రూపాయలు

*

ప్రాప్తి స్థానములు :
సాహితీ సమితి రేపల్లె. గుంటూరు జిల్లా
తల్లావఝ్ఝల వారు ఒంగోలు. గుంటూరు జిల్లా



# సప్తశతి

## ముక్తక ముక్తాహారం



డా. కొమరవోలు వెంకట సుబ్బారావు

M.A., M.D.H.

ప్రథమ ముద్రణము
ప్రతులు : 1000
1984



మూల్యము : 12 రూపాయలు

ప్రాప్తి స్థానము :
డా॥ కె. వి. సుబ్బారావు, M.A., MDH.,
18/37 ఆఫీసర్స్ కాలనీ
రామకృష్ణాపురం
సికింద్రాబాదు–500 556

ముద్రణ :
శ్యామలా ఎంటర్ ప్రైజెస్
5-1-246 జాంబాగ్ హైదరాబాదు-1

# పరిచయము

ఒక గ్రంథమును పరిచయము చేయుటలో తొలుతగ జరుపవలసినది ఆ గ్రంథ రచయితను గురించిన కథనము. కాని ఇచట ఆ రచయిత, ఇదివరకే పాఠకలోకమునకు సుపరిచితు లగుటవలన అట్టి ప్రసక్తికి ఆవశ్యకత ఎట్టిదియు లేదనియే చెప్పవచ్చును; ఆ సుప్రసిద్ధ రచయితను పరిచయము చేయుటకు పూనుకొనుట చర్విత చర్వణము, కేవల పుట పూరణము మాత్రమే కాగలదు. కాని గ్రంథ పరిచయమును చేయుటలో రచయితృ ప్రసక్తి తెచ్చుట తప్పనిసరి.

ఈ గ్రంథ రచయిత పూజ్య మిత్రులు శ్రీ కొమరవోలు వెంకట సుబ్బారావుగారు. ఇదివరకే బహు గ్రంథ రచయితగ పేరెన్నికను పొందినవారు. సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల, పాళీ భాషలలో తనకుగల సమధిక పాండితిని చక్కగ వినియోగించుకొని, అమూల్యములగు గ్రంథములను రచించి, తెలుగు పాఠకులకు వీరు అందజేసిరి. సాహిత్యమున మాత్రమేగాదు, వైదిక, బౌద్ధ, తాత్త్విక విషయానుశీలనమునను, ఆధునిక వైజ్ఞానిక విషయ వివరణయందును, వీరు ప్రజ్ఞాధురీణులుగ ప్రశస్తినిపొందిరి. వీరు రచించిన 'అమరశ్రీ'యును, పాళీ నుండి అనువదించిన 'మహావంశ'మును, వీరికిగల బౌద్ధమత విషయక పరిచితిని స్పష్టీకరించును; 'పరమాణుగాథ' ఆ పండితుని ఆధునిక వైజ్ఞానికశాస్త్ర పాండితిని వెల్లడించునది; 'యామూసా' గ్రంథము అద్వైత శాస్త్రముపై ఆయనకున్న అధికారమును ద్యోతకము చేయునది. ఇక పై రచనలందును తదితరములగు తక్కిన అన్ని రచనలందును ఎల్లెడ గననగునది అతనియందు నెలకొనిన ప్రతిభావ్యుత్పత్తులు. వీనినిమించిన వేరొక విషయము వీరియందు కననగుచున్నది. తన జీవితమునే ఒక 'త్యాగగాథగ' మలచికొనిన రాజయోగి ఈ పండితుడు. కేవల సేవాదృష్టితో వైద్యవృత్తిని స్వీకరించి దానిమూలమున ప్రజాసేవకు తన జీవితమును అంకితము చేసికొనిన ధన్యజీవి ఈ 'కవి'.

ఇక ప్రస్తుత గ్రంథము 'సప్తశతి'- ఈ పేరు చెప్పబడిన వెంటనే భారత సంస్కృతితో పరిచితి కలవానికి స్ఫురణకు తొలుతగ వచ్చునది హాల

సార్వభౌమ సంకలితమగు 'సత్తసయి' (సప్తశతి). రెండువేల ఏండ్ల క్రిందట ఆంధ్ర సామ్రాజ్యమున ఆదరణముపొందిన ప్రాకృత సారస్వతమందలి ఆణిముత్యముల వంటి గాథలను ఏడువందలను ఒకచోట సంకలనము చేసి, అనాటి కవి పండిత చక్రవర్తి హాలుడు రూపొందించినది. ఆ మహత్తమ గ్రంథము. అందు ప్రతి గాథయందును ఒక వైవిధ్యము, విశిష్టముగ కన్పట్టు ననుట కాదనరాని విషయము. కాని ఒకలోటు మాత్రము అందు ఎల్లెడల ద్యోతకమగును. అందు ఏక సూత్రత కొరవడినది. వివిధ రసములు పర్యవసించుట ఎట యనుట అట ప్రశ్నార్థకముగనే మిగిలిపోవును. ఇట్టి లోపమునకు గురికానిది ఇప్పటి ఈ సప్తశతి. పైగా పూర్వపు 'సప్తశతి' ఒక సంకలనము; ఇదియో ఏక కర్తృకము.

ఈ 'సప్తశతి' యందలి ఏక సూత్రతను వివరించుటకు ముందుగ కళా స్వభావమును గురించి కొంతగ ప్రసంగించుట సముచితము. కవిత్వమును ఒక కళయే కావున కళానిర్వచనము, కవిత్వమునకును అవ్యాప్తి, అతివ్యాప్తి దోషములకు లోనుగాని రీతిలో వర్తించును.

'కళ' అనుదానిని పలువురు పండితులు పలుతీరుల నిర్వచించిరి. ఆ నిర్వచనములను అన్నింటిని ఇట ఏకరువుపెట్ట నవసరములేదు. వానిలో దేనితోడను వివాదపడకనే 'కళ'ను 'రమ్యార్థ సృజన' అని మనము స్థూలరీతిలో నిర్వచింప వచ్చును. ఇట 'రమ్య' అను దాని భావము సహృదయుని స్థాయిని అనుసరించి వేర్వేరుగ వుండుటకు అవకాశము కలదు. కాని ఒక కళాఖండము శాశ్వతముగ హృదయమునకు హత్తుకొని నిలిచియుండవలెనన్న రమ్యత ఒక్కటియే సరిపోవునా? సరి కుదరదని పలువురి అభిప్రాయము. అందువలననే నన్నయ భట్టారులు విశ్వశ్రేయస్సును కూర్చుటయే కావ్యపు ప్రయోజనమని భావించిరి, కావ్యమునకు వారు భావించిన ఈ ప్రయోజనము తక్కుంగల కళలకును వర్తించును. కావున విశ్వశ్రేయమునకై జరిగెడు రమ్యార్థసృజనయే ఒక ఉత్తమ కళాఖండమని మనము నిర్వచింప వచ్చును.

విశ్వశ్రేయమును ధ్యేయముగ సంకల్పించిన కళాకారుడు కేవల స్రష్టగ మాత్రమే వర్తించి యూరకుండడు: ఉపదేష్టగ కూడ వ్యవహరించును. ఆ ఉప

దేశము కాంతాసమ్మిత రీతిలో సాగును. అందువలన కావ్యస్రష్ట, శాసకుని వలె వర్తింపక, మార్గదర్శకుని వలె వర్తించును. సహృదయుని – అతనికి సుపరిచితములగు విషయముల సాయముననే – ముందుకు కొనిపోయి, పరమార్థమును అతనికి అవగతము చేయును. ఇట్లు కొనిపోవునపుడు, పరిచిత విషయములనే చక్కగ విశ్లేషణచేసి సహృదయుని ఎట్టెదుట ఉంచుటయు మాత్రమే కావ్యస్రష్ట నిర్వహించును. ఇందువలన లోని మర్మమును గుర్తించగలుగు సహృదయుడు కడకి ధ్యేయమగు పరమార్థమును క్రమముగ చేరుకొనుటకు మార్గము సుగమమగును.

ఆదికావ్యమగు రామాయణము మొదలుకొని భారతీయ సాహిత్యమున గల ఉత్తమ రచనలందన్నింటి ఇట్టి విశ్లేషణయే పలు ఉపాఖ్యానముల, సంఘటనల, లౌకిక కార్యముల కథనమున కొనసాగినది. తక్కిన కళాకృతులందును ఈ విధముగనే జరిగినది. దేవాలయ శిల్పములందు లౌకిక విషయములును, సాంసారిక జీవితపు పలు ఘట్టములును ఇందువలననే తావు కల్పించుకొనినవి. నిరీహులు, నిస్పృహులు నగు బౌద్ధభిక్షుకులు రూపొందించిన అజంతా చిత్రములందు విరివిగ కన్పట్టు రాజులు, రాణులు, మృగయా వినోదములు, రాయబారములు, గాయనీ గాయకులు, వైణికులు, నటకులు, జానపదక్రీడలు పారమార్థిక లక్ష్యసాధనకై – ప్రాకృతిక విషయముల విశ్లేషణకు కళాకారులు పనిగొనిన తీరుతెన్నులను స్పష్టము చేయుచున్నవి.

రామాయణ, భారతాదులందు ఇట్టి లౌకిక విషయ విశ్లేషణ, కొన్ని ఉపాఖ్యానములనో, జీవిత గాథలనో అనుసరించి సాగినది. అటులగాకూడ సాంసారిక జీవితమున సంఘటిల్లు వివిధ విషయములను, యథాతథముగ, ఒకపద్ధతిని అనుసరించి విశ్లేషణ జరుపుటకూడ ప్రాచీన భారతీయ సాహిత్యమున కననగుచున్నది. అట్టి కృషికి ప్రముఖ లక్ష్యముగ పేర్కొనదగినది భర్తృహరి రచితమగు సుభాషితత్రిశతి. నీతి, శృంగార, వైరాగ్యములను మూడు శతకము లిందు కలవు. ఆయా శతకములందు చర్చితములగు విషయములు పద్ధతులు అను పేర వ్యవహృతములు.

వెంకట సుబ్బారావుగారు రచించిన ఈ 'సప్తశతి' యందును ఆయా అధ్యాయములు పద్ధతులుగనే వ్యవహృతములు. కాని భర్తృహరి రచితమగు త్రిశతికి ప్రస్తుతము ప్రశంసితమగు 'సప్తశతి'కి మధ్యగల సామ్యము ఇంత పూర్తి. ఇందులకుగల కారణము స్పష్టము. భర్తృహరి క్రీ.శ. ఏడవశతాబ్దికి పూర్వుడనుటలో పండితులకు ఏకాభిప్రాయత కలదు. అతని కాలపు సంఘమును చిత్రించుటను, విశ్లేషించుటను ఆ పండితుడు నిర్వహించెను. ఈనాడు 'సప్తశతి' రచించిన పండితుని ఎట్ట ఎదుట నున్నది ఏలోక రీతిలో నడచుచున్న సంఘము. భర్తృహరి నాటి సంఘమునకున్న నేటి సంఘము అన్ని విధముల - భావనలలో, వ్యవహరణలలో, వృత్తులలో, ఆశయాలలో - పెరుగ పరిణమించి అత్యంత క్లిష్టతను సంతరించుకొనినది, ఈ క్లిష్టతను విశ్లేషించి, కావ్య ప్రయోజనము, విశ్వ శ్రేయస్సునకై మార్గమును సుగమము చేయుటనే 'సప్తశతి' యందు కవి తన లక్ష్యముగ నిడుకొనెను. ఇదియే ఇందలి ఏక సూత్రత.

తాను రచించిన ఈ ఏడునందల గీతములను వివిధ 'పద్ధతులు'గ, వర్గీకరించి ఆధునిక సంఘ జీవనమును ఈ కవి చిత్రీకరించెను. ఇందు తొలుతటి ప్రకృతి పద్ధతి; కడపటిది ప్రగతి పద్ధతి. ఇటుల ప్రకృతినుండి ప్రగతికి పయనించుటలో వివిధ పద్ధతులను, సమూహమును అధిగమింపవలసి వచ్చును. ఆ పద్ధతుల అమరికలో కవి చక్కని కుశలతను ప్రదర్శించెను. నేటి సంఘము తావు కల్పించు కొనిన అన్ని రీతులను - కుటుంబరీతికి, పరస్పర వ్యవహార రీతులకు, రాజకీయ వ్యవహార రీతులకు ఈ పద్ధతులందు తావు లభించినది. ఇట్టి అమరికను అధిగమించినది ఆ యా విషయముల చిత్రీకరణ. శృంగార, హాస్య, బీభత్సాది వివిధ రసములతో దేనినైనను చక్కగ రూపుగొన జేయుటలో ఈకవి సిద్ధహస్తుడు. (మచ్చునకు 386, 451, 530 పద్యాలను పఠించండి)

శృంగారమును ఒలుకబోయు చిత్రమును చిత్రించిన కుంచెతోడనే 'మృతి'ని కూడ తీర్చిదిద్దగల బహుముఖ ప్రజ్ఞ ఈ కవిది (చూ: **516**వ పద్యము)

ఈనాటి సంఘమును విశ్లేషించు ఏ కళాకారుడును, రాజకీయరంగమును విస్మరింప జాలడుగదా! ఆ రంగమునందలి గుట్టు మట్టులను రట్టుచేయుటలో

సునిశితమగు ప్రజ్ఞ ఈ కవి రచనయందు కొట్టవచ్చినట్లు ద్యోతకమగును. (చూ: 5౮6, 5౯౪ పద్యాలు.

ఇక 'ప్రగతి' అనే పదపు మాటున రాజకీయ నాయకులు సాధించిన దానినే ఆయన ఈ విధముగ చక్కగ విశ్లేషించెను.

భరతమాతకయ్యొ ప్రగతి ప్రసవమంచు
పొట్టకోసి కనిరి పుట్టి వ్రణము
వ్రణములోన కనిరి లంచగొండి తనాలు
క్రిములు పాకు రాజకీయములును. 681

ఇట్టి 'ప్రగతి'ని ఆయన నిరసించినను, నిజమైన ప్రగతిని ఆయన ఆకాంక్షించి ఆ ప్రగతిని ఈ విధముగ నిర్వచించెను.

ప్రతిదినమ్ము నందు ప్రతిచోట ప్రతిజీవి
గర్భ చిచ్చికి శాంతి కలుగు నట్లు
తిండి తాను పరుల తినగల్గు జగతినే
ప్రగతి పూర్ణమైన జగతి యండ్రు. 687
వ్యష్టి పుష్టియే సమష్టి పుష్టికి అంకు
రమును జాతికెల్ల ప్రగతి కుదురు
జాతి పుష్టికెంత చౌకమున్నను, వ్యష్టి
పుష్టికది ప్రమాణ యష్టికాదు. 6౪2

ఇటుల 'నానా రసాభ్యుదయోల్లాసి' గా సాగినది ఈ విశ్లేషణ. ఈ నానా రసములను కడకు శాంతరసమున పర్యవసించును. విశ్వశ్రేయమనుడు, లేదా అట్టి పేరింకొక దానిని వాడుడు, ఇవి యన్నియు శాంతరసమున గర్భితములే. ఆ శాంత రసానుభవమే కవి ఆశించు అద్వైతసిద్ధి. ఈ విషయమునే కవి ఈ గ్రంథపు ఉపసంహారమున ఈ విధముగ నుడివెను.

'తానె బ్రహ్మమగుచు తనదె జీవాత్మగా
కావ్యరూపుడగును కవివరుండు'.

హైదరాబాదు
11-4-84

చీమకుర్తి శేషగిరిరావు

వ౯

# ప్రస్తావన

## అపూర్వమైన ఆటవెలదుల సప్తశతి

ఇది ఏడునూర్ల ఆటవెలదుల తేటగీతికల కవితాసంపుటి. కవితాసంపుటి అనుటకన్న కావ్యసంపుటి యనుట ఉత్తమము, పట్టి కవితా లక్షణము వేరు. కావ్యమునకు కావలసిన సామగ్రి వేరు. "వాక్యం రసాత్మకం కావ్యం" అన్న ఆలంకారోక్తికి తగిన సమగ్రమైన కావ్య లక్షణము ఇందలి ఆటవెలదులలో పుష్కలముగా కన్పడి–

"బ్రహ్మ మనసులోని బ్రహ్మాండ మంతయు
వాణినోట నమృత ఖాండ మయ్యె
అమృతఖాండ పాకమందున్న రుచిగాదె
ప్రాణికోటి కుండు బ్రతుకు తీపి"–

ఈ విధముగా ఆటవెలది పద్యమును కూర్చుటలోనే కావ్య శరీరమునకు కావలసిన సౌందర్య మంతయు నున్నది. ఇక కావ్యాత్మ గతమైన సౌందర్యము జూచినచో ఇది సృష్టికి ఒక రసవద్వ్యాఖ్యానము. అంతర్నిగూఢమైన కావ్యవస్తు పరిష్క్రియా చమత్కృతి చూచినచో వాణీ చతుర్ముఖుల సాంసారిక జీవన రహస్య మిది.

ఇట్టి పద్యము వ్రాసిన కవియొక్క సంస్కారపు లోతులు తడవినచో అలంకారశాస్త్రము, బహు కావ్యానుశీలన పటిమ, ఉపనిషదర్థావగాహనము ఆశ్చర్యము కలిగించును. బ్రహ్మ– శరీరము, వాక్కు– సరస్వతి. వాక్కునకు తెర తీయనిదే జగద్విలసనములేదు. "మనః ప్రాణ శరీరం బ్రహ్మ" అన్న 'శతపథ బ్రాహ్మణము'లోని రహస్యము ఈ పద్యము చెవిలో నూదుచున్నది.

ఒక పద్యమునుండి తద్గతమైన సమస్త శోభయు ఆవిష్కృత మగుట ఎట్టిదో ఈ కవి ప్రకృతినుండి గ్రహించినట్లు తోచును–

"ఇపుడు గిలిగింత లిడినట్లు కనిపించు
క్రొత్త పెండ్లికూతురుగ సుమ్ము
దాని రెక్కలింపు తడబాటు నొడబాటు
సరసుడైన వాడె ఎరుగగలడు."-

ముగ్ధా నాయికయొక్క ప్రథమ ప్రణయ మాధుర్య మట్లుండగా ఇక్కడ కవి పలికిన పలుకులలో దాగియున్న బహుభావ విలసనము కూడ 'సరసుడైన వాడె యెరుగ గలడు' అన్న కవి విశ్వాసమొకటి వ్యక్తమగును.

అసలు తెలుగులో ఆటవెలదికి పలుకుబడి తెచ్చినవాడు వేమనయోగి. ఆయనవలె అంత విస్తృతముగా ఆటవెలదిని వాడినవాడు తెలుగు కవులలో మరియొకడు లేడు. కాని వేమన ఆటవెలదులలో కవిత పాలుకన్న సూక్తులపాలు యెక్కువ. తత్త్వబోధ లెక్కువ. ఉక్తిచమత్కృతికి చెప్పుకోదగినంత యుండును గాని ప్రతిపద్యము విభావానుభావాది సామగ్రిచేత కావ్యమనిపించదు. ఈ సప్తశతిలోని ఆటవెలదులు అట్టివి కావు. ఇవి కావ్యములు. ఏ పద్యమున కాపద్యములో ఒక కథ, ఒక రసము పరిపుష్టి నందినవి. అంతయు వ్యంగ్య భూయిష్ఠము. కావ్యాత్మ ధ్వనియన్నచో; అట్టి ధ్వనిగల కావ్యమే ఉత్తమమైన దన్నచో, ఆ ధ్వని యెక్కడోలేదు; కవి వాడిన శబ్దార్థముల రామణీయకముపై నాధారపడియున్నదన్నచో, అది 'విశిష్టపద రచనా రీతిః' అని చెప్పదగిన సరణిలో నున్నదన్నచో, ఈ విధమైన పరిపుష్టిగల ఆటవెలది పద్యరచన ఇంతవరకు తెలుగులో లేదన్నచో, అతిశయోక్తి కాదు.

హాలుని గాథా సప్తశతి కొందరనువదించినారు. కానీ ఈ నిగ్గు రాలేదు. అక్కడక్కడ వచ్చినను అది అనువాదమో, అనుకరణమో, అనుసరణమో గాని వీనివలె స్వతంత్రమైనవి కావు. అందుచే నిస్సందేహముగా చెప్పవచ్చును— ఈ సప్తశతి ముక్తక కోటి ఒక స్వతంత్రమైన కావ్యఖండ సంపుటి-అని.

జీవితమును తాత్త్వికదృష్టితో అనుశీలించిన వానిలో హృదయము స్పందించు లక్షణ మున్నచో; ఆ స్పందనము అక్షరములుగా, పదములుగా, ఛందః పాదములుగా వాని యంతట నవి రూపు దాల్చినచో ఆ పద్యము లిట్లుండును.

అవి కవితలో! రసహీనములో! ఉపన్యాసవ్యాసములో! భావకవితా లేశములో! ఏవి ఏమో చెప్పవలసినపనిలేదు. ఆ పంక్తుల పాదములు, ఆ పదములు ఆ అక్షరములు కలిగించెడు పఠితహృదయములో కలిగించు స్పందనములు కవియొక్క హృదయస్పందనములకు సమానములుగా నుండును. కవి తన హృదయముతో సమానమైన హృదయము కలవానిగా పఠితను చేసికొనుటయే అతని చరితార్థత. అదియే కవియొక్క రసనిష్పాదన సరణి- పఠిత రసానుభవము 'చిత్తవృత్తి స్పంద విశేషో రసః' అన్నదండి కవులకు చేసిన ఉపదేశమిదే!

"పడుక వలదు, వలదు పట్టెమంచము పరుపు
చాలు రాకు వట్టి చాప యైన
చాప లేకపోయినా పాపమేమి రా
దతివ! నీ యనుగ్రహమ్మె వలయు"-

ఇక్కడ నాయకుడు నాయికకు చేసిన అభ్యర్థన సంయోగ శృంగారమునకు రాచబాట. కవులకు కూడ మన మీ విషయమే చెప్పుకొనవలయును. పదము వలదు; ఛందస్సు వలదు; అలంకారములు వలదు; అవి యేవి లేకపోయిననూ కావలసినది హృదయమును స్పందింపచేయు రసము. అది లేదో నీ ఛందస్సులు, అలంకారములు, శయ్యలు మా కెందులకు?

ఒక్క వాన చినుకుచాలు హృదయ స్పందనకు.

"పసరు మొగ్గవోలె ప్రసవించు నన వోలె
అమ్మవోలె ముత్తియమ్ము వోలె
గుమ్మటమ్ము వోలె కులుకు నర్తకి వోలె
చిందులాడె వాన చినుకు సోన"-

వాన చినుకు చిందు లెట్లున్ననూ, ఈ కవి ఆటవెలది పలుకు చిందులు కవితా రసపు బిందులు.

లోక తత్త్వమును కాచి వడబోసిన ఈ కవి విభిన్న రుచులుగల జన కోటికి అన్ని రుచులలోనూ తన కవితా సంపద పంచి పెట్టినాడు.

"ఒకడు మబ్బు మెచ్చు, ఒకడు తుంపర మెచ్చు
ఒకడు వాన మెచ్చు, ఒకడు జల్లు.
తడియు నొకడు మెచ్చు గొడుగు నొక్కడు మెచ్చు
మనుల మేను ముదిమి కురియు నపుడు"-

ఇట్టి రుచి భేదము ఎరిగినవాడు కనుకనే ప్రకృతిని, ప్రకృతిలోని మానవుని, అనుభవము నొందని సమస్తమును, తన హృదయములో నుండి స్పందింప జేసినాడు.

"ప్రకృతి నాది నేను ప్రకృతిని నా కంది
లోన నుండి ఆమె లోన నుండి
యేను నొకరి నొకర మీక్షించు కొందుము
ప్రకృతి నాకు కన్ను, ప్రకృతి కేను"-

ప్రకృతిని దర్శించు పురుషుని, పురుషుని దర్శించు ప్రకృతిని, దర్శించు వాడెవడు? తానె యదియై అదియె తానైనవాడు. ఆ స్థితి మనకీ కావ్యము చదివి నపుడు కలిగినచో ఈ కవి తాను చరితార్థుడనని భావించు వాడు.

ఈ ఏడువందల పద్యములలో ఏ పద్యము ఉదాహరింపక పోయిననూ చెప్పవలసినది చెప్పినట్లే' కాని యెన్ని పద్యము లుదాహరించ గలము? ఉదాహరించి ఒక్కొక్క పద్యమునకు కనీసమొక పుటయైననూ, పూటయైననూ చెప్ప వలసిన దెంతయో కలదు. ఒక్కొక్క పద్య మొక్కొక్క కావ్యము; ఒక ఉపనిషత్తు; ఒక జీవిత సందేశము; ఒక అనుభూతి మంజూష; ఒక కవితాస్రవంతి ఇవి యన్నియు భాసించి ఈ జగత్తుయొక్క అభావమును భావింపచేయు తత్త్వ రహస్యము నిందులోనే ఇమిడ్చినాడు కవి.

తెలుగులో నేడు అచ్చమైన కవితకు ప్రజలు దూరమైనారు బ్రదుకులోని బరువు తీర్చుకొనగల సందేశమిచ్చు కవులు కరవైనారు. సూక్తులు, నినాదములు పలుకులలో తళుకులు, మాటలలో తేటలు, కవితలని భ్రమించుకవులు- వారే మనకు పెన్నిధులని తృప్తి పడుచున్న జనము ఎక్కువైనారు. ఈ కవి

రచన ప్రజలలో వినబడినా చాలు ప్రజకు కవిత రుచి బ్రదుకు తీపి తెలియగలదు అని నా విశ్వాసము.

ఈ సప్తశతి వ్రాసినవారు డెబ్బది యేండ్ల వృద్ధు, శ్రీ కొమరవోలు వెంకట సుబ్బారావుగారు చిరకాలము మిలిటరీలో ఉద్యోగముచేసి రిటైరయిన వారు. మిలిటరీకి శరీరమునూ, కవితకు మనస్సునూ ఒప్పగించి నట్లున్నారు. లేనిచో మిలిటరీనుండి క్షేమముగా వెలుపడుటగానీ, ఇట్టి కవిత వ్రాయుటగానీ జరిగి యుండెడిది గాదేమో!

స్త్రీ పద్ధతి, వయసు పద్ధతి, శాస్త్ర పద్ధతి, లోక పద్ధతి, పురుష పద్ధతి, జీవ పద్ధతి, మృతి పద్ధతి, ఛాత్ర పద్ధతి, నర్మ పద్ధతి. ఇట్లు ఎన్నో పద్ధతులలో తన ఊహను, అనుభవమును, భావనను, ఉపనిషద్విజ్ఞానమును, గుచ్చియెత్తి బ్రహ్మసృష్టికి అద్దముపట్టినట్లు, సప్తసముద్రములు పొంగినట్లు, సప్తర్షులు పలికినట్లు, సప్త స్వరాలు మ్రోగినట్లు, సప్తతంతువు జ్వలించినట్లు, ప్రాకృత గాథా సప్తశతి ప్రతి ధ్వనించినట్లు, సప్తవ్యాహృతుల సోపానము లెక్కినట్లు ఈ సప్త శతి నొక సప్తశత కావ్య సంతతిగ తెలుగు తల్లికి కానుక పెట్టినారు.

తెలుగులో ఆటవెలది పద్యమునకు ఈ కవి సమకూర్చిన విలక్షణమైన అలంకృతి ఈ సప్తశతి.

16-4-84

పేరాల భరతశర్మ
Lecturer in Sanscrit
P. R. Government College
Kakinada.

# విజ్ఞప్తి

మన శ్శరీరముల మహా సంగ్రామరంగము ప్రకృతి. మూల ప్రకృతికి మాయ అని మఱొక పేరు. మాయ పరమాత్మ శక్తియే. ప్రకృతి రూపమైన మాయ విలాసదోహరమోహిని; అజాయమానుడైన బ్రహ్మము బహుధా విజాయమాను డగుటకును, ఆనంద ఘనుడైన పరమాత్మ ఆవరణ విక్షేప శక్తులవే ఆచ్ఛాదితుడై, శబల బ్రహ్మముగా కనుపట్టుటకును, హేతుభూత మగుచున్నది ఈ మూల ప్రకృతి యనబడు మాయయే.

'ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునః పునః భూతగ్రామ మిమం'

'మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్'

'దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా' ఇత్యాది గీతావచనములలో కృష్ణ పరమాత్మ పై విషయములను లెస్సగా వివరించి యున్నారు.

మన శ్శరీరముల సంఘర్షణయు, గుణమయి అయిన మాయా ప్రకృతి వైచిత్ర్య విలాసములును, సప్తశతి యందలి కావ్య వస్తువులు. ఆ వైచిత్రీ విలాసములకు ఉపాదాన కారణముగా సూత్రధారిగా, అంతర్నిహితుడై తానుండి జగన్నాటకమును నడుపు పరమాత్మ వైభవమే కావ్యములోని ధ్వని.

ఇందలి కవితా సామగ్రి ప్రకృతినుండియే సహజ నాగరిక భేదములచే ద్విముఖములుగా స్వీకరింపబడినవి. సూర్యోదయాస్తమయములు, ఋతువులు, చీకటి, నక్షత్రములు, పంచభూతములు, సముద్రములు, తుఫానులు, కొండలు, సెలయేళ్ళు, పక్షిరుతములు, ఆకాశము. చెట్లు, తీగలు, పూలు. కాయలు, భూమి ఇత్యాదులు ప్రకృతికి సహజ ముఖముగను, రోడ్లు, మైలురాళ్ళు, కట్టడములు, డాక్టర్లు, మందులు, కాలేజీలు, స్ట్రైకులు, రాగింగ్. డక్కింగ్, పాలిటిక్సు, కాలాబజారు, దొంగనోట్లు, యంత్రములు, తద్దినములు, పెండ్లిండ్లు, చంద్రలోక యాత్రలు, అణుబాంబులు, హోటళ్లు, కాఫీలు, టీలు, కాంగ్రెసు

కమ్యూనిష్టులు, హిందు, ఇస్లాము, క్రైస్తవ మతములు ఇత్యాదు లన్నియు ప్రకృతియొక్క నాగరిక ముఖముగను స్వీకృతము లయినవి. సహజ ప్రకృతి చిహ్నములే కొన్నిచోట్ల నాగరిక ప్రకృతి చిహ్నములుగ పాటింప బడినవి. పద్యము లన్నియు కాల సూత్రమున గ్రుచ్చబడినవి.

ఇందులో లౌకికముగా చూచిన ఏ ఒక్కటికూడ కావ్యవస్తువు కాకున్నను ఒక అలౌకికార్థమును దానిపైన ప్రతిష్ఠించి, దానిని కళాదీపముగా వెలిగించుటకు ప్రయత్నము జరిగినది. ఏతాదృశ దృష్టికల సరసున కది రసస్ఫురియే కాగల దని ఆశయము.

'యద్వైతత్ సుకృతం రసోవైసః' అని పరమాత్మను వేదములు రస స్వరూపునిగ వర్ణించినవి.

'కవిం పురాణ మనుశాసితారమ్'
'కవిర్మనీషీ పరిభూః స్వయం భూః'
'కవిం కవీనా ముపశ్రవస్తమమ్'

అని శాస్త్రములు పరమాత్మను కవిగను, మనీషిగను, ప్రశంసించినవి. కవి అనగా క్రాంతిదర్శి, సర్వద్రష్ట; ఈ అర్థములు పరమాత్మయందే సార్థకత వహించును కాని అన్యత్ర అట్లు వర్తింపవు. పరమాత్మయొక్క సర్వశక్తిమత్వ, సర్వజ్ఞత్వ, సర్వ ద్రష్టృత్వములను, "అపాణి పాదో జవనో గ్రహీతా పశ్య త్యచక్షుః, స శృణోత్యకర్ణః" అని ఉపనిషత్తులు వర్ణించినవి. ఆయన సృజించిన జగత్తు ఊర్ధ్వమూలాధశ్శాఖా వైచిత్ర్యము గలది.

పద్యములలో ఈ భావములను ప్రపంచించుటకై, రసస్ఫోరకములయిన పదముల మధ్య లంకెగా వ్యంగ్య మర్యాద నుపయోగించుకొనడ మయినది. పద్యములలో చాలవఱకు ఊర్ధ్వమూలాధశ్శాఖాకములే; ఏలన, అందు చివరి పాదమో, చివరి పదమో, చివరి అక్షరమో పద్యమంతటికి జీవాతువై యుండును. ప్రతి పద్యమునకు వాచ్యార్థ మొకటియు, సూచ్యార్థ మొకటియు వినిబద్ధమై ఉండును. వాచ్యార్థ చిత్రమునకు సూచ్యార్థము పరిపుష్టి నొసగునదిగనో, లేక దానిలోని వైషయికత్వమును కడిగివేయునదిగనో ఉండును. సూచ్యార్థము ఆలోచనాక్లిష్టము, అయినను అమృత పర్యవసాయి.

ఉదాహరణకు రెండుపద్యములను ఉదహరించి అందలి వాచ్యార్థ సూచ్యా ర్థములను వివరింతును.

తోరణమ్ము కట్టినారు, "యువాసువా
సా" యటంచు నీవు చదివినావు,
మంత్రముల ద్విజోత్తమా' చెప్పుమిటు వివా
హమ్ము? చేసినావ యపర కర్మ? 517

ఇందలి వాచ్యార్థము. బయటనుండి గుమ్మమునకు కట్టిన తోరణము కన్పించుచున్నది. కనుక లోపల ఏదోశుభకార్యము జరుగుచున్నదని అందఱకు బోధపడుచున్నది. పురోహితుడు 'యువా సువాసా'అని మంత్రమును చదివి నాడు; ఈ పద్యములో మొదటి మూడుపాదములలోను పఠితకేమియు విపరీత ముగ తోచదు. కాని నాల్గవ పాదమున, అందును కడపటి పదమైన 'అపర కర్మ' అను మాటలోనే పఠిత కిందేదో మర్మమున్నదను అనుమానముపొడమును. అందఱకు సామాన్యముగా వైదిక మంత్రముల పరిజ్ఞానముండియుండదు. కనుక 'యువాసువాసా' అను మంత్రము వివాహ సంబంధమైనదను భావమే మనస్సులో ప్రసరించుచుండును. కాని, 'అపర కర్మ' అను ఆఖరిమాట చదువగనే అంత వఱకు పుట్టని సందేహమొకటి ఆతని మదిలో ఉదయించి తీరును. ఇది అనధి కారులమాట. (అధికారి యయినవానికి ఈ సంశయము మొదటనే కలుగుననుట వేఱొక విషయము). ఏతావాతా సంశయముపుట్టిన వెంటనే, గ్రంథావలోకనము ననో, ఇతరుల నడిగి తెలిసికొనుట వలననో "యువాసువాసా" మంత్రము ఆబ్దిక మంత్రముల లోనిదని పఠిత గ్రహింపగలడు. విశ్వేదేవ స్థానములో కూర్చుండు బ్రాహ్మణునకు, అంతఃప్రావరణార్థము, బహిఃప్రావరణార్థము, గుడ్డలిచ్చునపుడు 'యువాసువాసాః పరివీత ఆగాత్స ఉశ్రేయాన్భవతి స్వాధియో మనసా దేవయన్తః' అను మంత్రమును చదువుచు కర్త భోక్తకు తడిపిన గుడ్డల నిచ్చును. విశ్వేదేవబ్రాహ్మణుడు 'సువాసః' అని బదులుపలికి వానినిగ్రహించును. ఈ విమర్శానంతరముకూడ ఆబ్దికములో చదువవలసిన మంత్రములను వివాహ ములో పురోహితుడు పొరపాటున చదివినాడని మాత్రమే సరిపెట్టుకొనును, కాని పాఠకుడు అత డట్లేల చదివెనో, అను విషయమును అంత సూక్ష్మముగా

గ్రుచ్చి చూపను. ఇందలి విశేషార్థము తెలిసికొన్ననే కాని, దానిలోని సొగసు బోధపడదు.

వివాహములలో మిథున విడియ ఉపహోరాది మంత్రములలో 'యువం వస్త్రాణి పివసావ సాథే యువోరచ్ఛిదా మవవోహసర్గాః' అను మంత్రము కలదు. ఈ మంత్రము పఠించి వరునకు వస్త్రములను ఇప్పింతురు. పురోహితులలో నూటికొకనికి గాని మంత్రార్థములు తెలియవు. తంతు ప్రధానము, దాని వెనుక మంత్రముగా వారు వైదిక కార్యములను నడపుచుందురు. పై రెండు సందర్భములలోను గుడ్డ లిచ్చుటయే తతంగము కనుకను, రెండు మంత్రములు 'యువ' అను రెండక్షరములతో ఆరంభించు చున్నవి కనుకను, నోటివాటున పురోహితుడు ఆబ్దికమునకు సంబంధించిన మంత్రమును వివాహములో ఏకరువు పెట్టినాడని అర్థము. అనగా పద్యములోని పురోహితుడు ఎక్కువగా పితృకార్యములను చేయించువాడని అర్థము. ఇటువంటి అసందర్భములు తటస్థించకుండ, తెలిసినవారు, పితృకార్యములను చేయించు పురోహితులను శుభకార్యములకు పిలువరు. ఇక జ్ఞానులపక్షములో శుభాశుభముల గొడవయే ఉండదు. 'శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ మే ప్రియోనరః' అను భగవద్గీతా వాక్యము ఈ పద్యము నందలి ధ్వని. మంత్రార్థముల పరిచయమున్ననే కాని పద్యము నందలి అంతర్యముగాని, ఉక్తి చమత్కారముగాని అవగాహనకాదు. మంత్రములు, వైదికాచారములు, ప్రజాధికార పదస్థనిరస్తములగుచున్న ఈ కాలమున ఎందఱకీ వ్యంగ్య మర్యాద లాదరణీయములగునో చెప్పజాలము.

పోనిండు. దానిని విడిచిపెట్టి సులభముగా అర్థముకాగల మఱొకపద్యము నుదాహరింతును.

నీకు నాకు మధ్య రైకలేటికి కోక
లేటికంచు నటు గిరాటువేయ
తడిపివేసె వాని దాసి; నీ ధోవతి
చుట్టుకొంచు నేగుచుంటి. బావ! 442

ఈ పద్యములో కూడ చివరివగు బావ' అను పదమును చదువుకొనుటను, పద్యములోని వ్యక్తులు బావ మఱదళ్ళని పఠిత కర్థముకాదు. ఆఇద్దఱు

రసజగత్తు నందున్నారు. పద్యములోని వాచ్యార్థము సులభముగనే అర్థమగుచున్నది. మఱదలి ఒంటిమీద నున్న రైక కోకలు తమ కడ్డువచ్చినవని బావ వాటిని నమ్మ మావలకు విసరివేసినాడు. తెల్లవారుజామున వచ్చినదాసి బయటనున్న అమ్మగారి కోకలను తడిపి ఆరవేసినది. ఆవరణము లేకుండ బయటికి వ్యక్తమగుటకు వీలుకాదు, కనుక, మఱదలు కడగాపడియున్న బావ ధోవతిని చుట్టుకొని వెళ్ళిపోయినది. సంభోగశృంగారము, రసము, రతి, స్థాయీ భావము, ఇటువంటి అలంకారిక విషయముల నీ సందర్భమున తడవను. కాని, పై వాచ్యార్థమును మించిన సూచ్యార్థమును మాత్రమే ఇట వివరించెదను,

ఈ సూచ్యార్థము వేదాంత పరిధులోనిది. కంసాలివాని లక్కముద్ద లోని స్వర్ణలేశములవలె జీవుల కర్మములు పరమాత్మ శక్తిలో ఇమిడి ఉండును. కర్మములకు పరిపక్వదశ వచ్చినప్పుడు, పరమాత్మ శక్తియైన మూలప్రకృతి సృష్టికాలమున, మాయ, అవిద్య, తామసి అను పేళ్ళతో సత్వ రజ స్తమో గుణముల ప్రతీకలుగా మూడు విధములుగా రూపొందును. శుద్ధ సత్వ ప్రధానమైన మాయచే నావరింపబడి, పరమాత్మయే ఈశ్వరరూపుడై కన్పట్టును. ఈశ్వర ప్రేరితమైన ఈక్షణముచేత తమోగుణరూపమైన ప్రకృతియే ఆవరణ శక్తిగను, విక్షేపశక్తిగను రూపొందును. ఉన్నవస్తువు నావరించి దానిని లేనట్లు తోపజేయునది ఆవరణశక్తి. లేని వస్తువు నారోపించి ఉన్నట్లు తోపించునది విక్షేపశక్తి. వీనినే తులావిద్య, మూలావిద్యలని కూడ అందురు. ఈ శక్తుల ప్రభావము వలననేఉన్న పరమాత్మ ఆచ్ఛాదితుడై లేనట్లుతోచుటయు, లేని జగత్తు పరమాత్మపై నారోపితమై ఉన్నట్లుకనిపించుటయు జరుగుచున్నది. ఇది అద్వైత సిద్ధాంతము.

ఆవరణ మనగా కట్టుబట్ట అనియు విక్షేప మనగా విసరివేయుట అనియు కూడ అర్థములున్నవి. తమస్సంబంధి ఆవరణశక్తి; రజస్సంబంధి విక్షేప శక్తి. ఈరెండుబంధములు తొలగిపోయిననేగాని జీవున కాత్మజ్ఞానము కలుగదు. ఇక్కడ బావ మనసులో పరకీయ యైన మఱదలి పట్ల స్వీయాభ్రాంతిని, చిత్త విక్షేపమును, విక్షేపశక్తియే కలిగించినది. నిజస్థితిని, వివేకమును, ఆవరణ

శక్తి పోగొట్టినది. విక్షేపశక్తి ప్రభావమున రజోగుణ చిహ్నములయిన రైక క్రోకలను విక్షిప్తములు చేసి (గిరాటువేసి) ఆమెనుకూడ తన తమస్థాయికి తెచ్చుకొన్నాడు నాయకుడైన బావ. బావ మరదళ్లు ఇద్దరు తమో నిద్రలో మునిగినారు. ఆ తమస్స్వరూపిణి తిరిగి తన రజోభావము నొందుటకు, కడగానున్న అతని ధోవతిని చుట్టుకొని గదినుండి వెళ్ళిపోయినది. మరి బావగతి ఏమయినది అని పాఠకుని మనస్సులో ప్రశ్న చెలరేగక మానదు. ఆవరణ బంధముతొలగిన జీవాత్మకు ఆత్మజ్ఞానము, బంధ విముక్తి, కలుగునని లోగడ వ్రాసియుంటిని. అట్టి అనావరణ సిద్ధి లభించిన నాయకునకు (బావకు) తప్పక జీవాత్మకు వలెనే జ్ఞానోదయము కలిగెననియే పద్యము నందలి ధ్వని. నాయకున కిట సంప్రాప్తించిన ఆవరణము అసత్త్వావరణమా? లేక అభానావరణమా?అని తర్కించుట శ్రీనాథు డధిక్షేపించిన ప్రధ్వంసాభావ ప్రాగభావ చర్చవంటిదే కాగలదు. ఈ వ్యాసమున మొదటి రెండు పేరాలలో ప్రస్తావించిన మన శ్శరీర సంఘర్షణలు, గుణమయి అయిన మాయా ప్రకృతి విలాసములు ఈ పద్యమున పుష్కలముగానే ఉన్నవి. ఈదృశమైన అనుభవము కలిగినప్పుడే లీలాశుకుడు నిర్వేదము నొంది కృష్ణకర్ణామృతమును రచించినాడు.

గ్రంథాంతమున ఉదహరించిన 'పరాఞ్చిఖాని వ్యతృణత్స్వయంభూః తస్మాత్ పరాఙ్పశ్యతి నాంతరాత్మన్' అను మంత్రమునకు 'స్వయంభువు అయిన పరమాత్మ మనజ్ఞానేంద్రియములకు కేవలము బాహ్యవస్తువులను చూడగల సామర్థ్యమునే ప్రసాదించి ఉన్నాడు. అందువలన అవి అంతరాత్మ విషయములను గ్రహింప జాలవు'అని అర్థము. కావున తఱచిచూచినగాని బాహ్యార్థము స్ఫురించినంత సుకరముగా, పద్యము నందలి ఆంతర్యము మనసునకు తట్టదు.

జగన్నాథపండితుని రమణీయార్థ ప్రతిపాదక శబ్ద శిల్పము, భరతుని రసము, వామనుని రీతి, భామహుని అలంకారము, ఆనందవర్ధనుని ధ్వని. కుంతకుని వక్రోక్తి ఈ అన్నింటిని మనసులో లక్ష్యముగా పెట్టుకొని, నా యోచినకొలది సప్తశతిని రచించితిని. ఇందలి గుణాగుణముల నిర్ణయము రసజ్ఞులకే వదలివేయు చున్నాను.

కిం కవే స్తస్య కావ్యేన కిం కాండేన ధనుష్మతః
పరస్య హృదయే లగ్నం నఘూర్ణయతి యచ్ఛిరః.

అను సూక్తి ననుసరించి రసజ్ఞుల ఆనందమే కావ్యమునకు గీటురాయిగా విశ్వసించుచున్నాను.

172 వ పద్యమునకు బదులుగా

మాంస భోజనమున హింస యేమున్నది ?
సహజమైన యవియె చావు బ్రదుకు;
ఎలుక చావు పిల్లి చెలగాటమున కదా !
ఈవు పిల్లిపంచ ఎలుగనైతి.

అను పద్యమును

179 వ పద్యమునకు బదులుగా

కులుకు నడక తోడ కుత్తుక నగతోడ
తోక త్రిప్పుకొనుచు పోకు మటకు,
భయము లేక యట్లు పావురమ్మ ! తుపాకి
కన్ను నిన్ను చూచుచున్నదకట !

అను పద్యమును

చదువుకొనవలసినదిగ విన్నపము.

ఈ కావ్యమునకు అమూల్యమయిన పరిచయ వాక్యములను వ్రాసి ఇచ్చిన శ్రీ చీమకుర్తి శేషగిరిరావు గారికిని, అనర్ఘమయిన ప్రస్తావనను సంతరించిన శ్రీ పేరాల భరతశర్మ గారికిని వినమ్రుడనై కృతజ్ఞతను తెల్పుకొనుచున్నాను.

24-4-84,
18/32

ఇట్లు
బుధజన విధేయుడు
డా. కొమరవోలు వెంకట సుబ్బారావు
M.A., M.D.H.

# సవరణ పట్టిక

| పద్య సంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 32 | ఎఱ్ఱనైన | ఎఱ్ఱగనైన |
| 33 | తప్పులెల్లి | తప్పులెల్ల |
| 77 | వటి | వట్టి |
| 81 | భార | భార్య |
| 87 | మటి | మట్టి |
| 229 | పడతిపై | పడతిపైన |
| 268 | అడయెపని | అదియెపనిగ |
| 354 | వరుడు | మరుడు |
| 360 | కోరలు | కోఱలు |
| 361 | వరుల | పరుల |
| 379 | నఱకువెటి | నఱకువెట్టి |
| 417 | మూడయదులె | మూడయిదులె |
| 547 | నోయును | సేయును |
| 549 | గ్రోళ్ళు | గోళ్ళు |
| 554 | ఘ ము | ఘనము |
| 565 | వేల | లేల |
| 600 | గుత్త్నదారు | గుత్తదారు |
| 628 | హోటేలు | హాటేలు |
| 629 | వ్రజకు | ప్రజకు |
| 645 | ఖోద | బోధ |
| 647 | సైనికింగులు | సైనికులు |
| పే. 12 | అధరాన | ఆరాధన |
| పే. 40 | స్త్రీ పద్ధతి | వివహ పద్ధతి |

# అభిప్రాయము

రసప్రధానాశ్శబ్దార్థాః
గుణాలంకార వృత్తయః
రీతయశ్చేయతీకావ్య
ప్రమేయం కావ్య పద్ధతి

అన్నాడు విద్యానాథుడు.

శబ్దార్థములు రసప్రధానములుగా వుండాలి. రసవంతమైన ఒక్క పద్యం హృద్యమవుతుంది. ముక్తకాలతో రసస్పందన కలిగించినవాడు హాలుడు. ప్రాఃముక్తకాన్ని గాథ అన్నారు. గాథా సప్తశతి సుప్రసిద్ధము కదా?

డా॥ కొమరవోలు వెంకట సుబ్బారావుగారు సుప్రసిద్ధ కవులు, విద్వాంసులు, వేదాంతవిదులు. వీరి "యామాసా" ఇందుకు నిదర్శనము.

ప్రస్తుత చర్చనీయాంశము వీరి "సప్తశతి". వాచ్యం ఉత్తమకవిత్వం కాదు. కనుక కవిగారు వ్యంగ్యమును, వక్రోక్తిని ప్రయోగించి ఈసప్తశతిని రచించారు. ఈ సప్తశతిలో భిన్న భిన్న పద్ధతులను చేర్చారు. ప్రకృతి పద్ధతి నుంచి ప్రగతిపద్ధతి దాకా ఉన్నాయి.

డా॥ కట్టమంచి రామలింగారెడ్డిగారు శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారి శాలివాహన గాథా సప్తశతీసారమునకు పీఠిక వ్రాస్తూ:—

"ఒక్క పద్యమే వ్రాయవలయును. అది మెరుగు దీగవలె మనల క్రమ్మియుండు నంధకారమును ఒక్క క్షణము ప్రోద్రోలి నూతన లోకమును హఠాత్తుగ గోచరింప జేయవలయును" అన్నారు.

ఆ లక్షణాలన్నీ డా॥ కొమరవోలు వెంకట సుబ్బారావు గారి ప్రతి పద్యంలో నాకు సాక్షాత్కరించాయి. ఉదాహరణలు చూప వలెనన్న ఈ సప్త శతిలోని ప్రతి పద్యమును ఉదహరించవచ్చును.

గ్రామ్యపద్ధతిలోని ఒక పద్యం చిత్తగించండి:-

"కూలినాలి చేసికొను వారి యెడదలో
నందనాల పూలు వందవేలు:
ధనికులైన యట్టి జనుల చిత్తము లందు
పాడు గబ్బుతోడ పేద దిబ్బ"

హృదయంలోనే నందనాలు; హృదయంలోనే పేడదిబ్బలు. కూలి నాలి చేసికొను వారి హృదయాలే నందనవనాల వలె ఉండునను ఈ కవిగారి భావన అత్యుదాత్తము, అభ్యుదయ భావబంధురము, రసరంజకము.

(కష్ట మెఱుగని ధనవంతుల సంకుచిత, స్వార్థపరతతో మురిగిన పేడ దిబ్బవలె మృత్యు వాసనలను విరజిమ్ముతున్న ధనశక్తి, వికసన శీలము లైనప్పటికీ, లేమితో నాసిల్లే కష్టజీవుల ఎడదలనే నందన వనాల్లో ఎరువుగా వినియోగపడితే అవి ఇంకా చక్కగా పూలు పూయగలవనీ, ఈ మేరకు సమాజ చైతన్యం నే డవసరమనీ పద్యంలోని ధ్వని.)

డా॥ కొమరవోలు వెంకట సుబ్బారావు గారి సప్తశతికి సుస్వాగతము. ఆధునికాంధ్ర రసిక లోకము హాలగాథా సప్తశతివలె ఈ సప్తశతిని కూడ ఆస్వదించి రసించు గాక.

డా॥ దాశరథి
ఆంధ్రప్రదేశ్ మాజీ ఆస్థానకవి

హైదర్‌గూడా,
హైదరాబాదు-500001



# కృతి సమర్పణ

శాలివాహన గాథాద్య సప్తశతిని
ఉగ్గుగాబెట్టి ఆంధ్రికి బుగ్గ నిగ్గు
ఒసపరితసమ్ము నేర్పిన రసతపస్వి
హాలభారతి కీ కృతి అంకితమ్ము.

# సప్తశతి

## ప్రకృతి పద్ధతి

స్వామి! నీ పవిత్రధామమ్ము చేర్చు నే
నారికేళి జీవనస్రవంతి
నుంచు నాకు నిర్ఝరమ్ముగా నెప్పుడైతి
పడవ నీది, యీ ప్రవాహ మాది. 1

క్షితిని పంపి నాకు జీవనమ్మునకు క్రొత్త
తీగ అల్లుపెట్టినావు స్వామి
అది చిగిర్చి పూచె, నాత్మలో నీ ప్రేమ
పరిమళింపగలుగు వరము నిమ్ము. 2

చుక్కలవనుల నడుమ చక్కనైన జాబిల్లి
బంతి నాడుకొనగ పంపినావు
బంతి నన్ను గూర్చి పట్టించుకోదయ్యె
దాని పనుగదేదొ దాని పనుగ. 3

బ్రహ్మ మనసులోని బ్రహ్మాండ మంతయు
వాణి నోట నమృతభాండ మయ్యె
అమృతభాండపాక మందున్న రుచిగాదె
ప్రాణికోటి కుందు బ్రదుకు తీపి. 4

ఆకసమ్ము చీర లారవేసికొనంగ
అలల వోలె కడలి తలల నెత్త
నిసుమురవలు గాలి దెసలూని ప్రసరింప
వింత స్మృతుల నెమరువేసె మనసు. 5

ప్రకృతి నాది; నేను ప్రకృతిని; నా కంటి
లోన నుండి యామె లోన నుండి
యేను నొకరి నొకర మీక్షించుకొందుము,
ప్రకృతి నాకు కన్ను: ప్రకృతి కేను. 12

ఉషుడు గిలిగిలింత లిడినప్డె కనిపించు
క్రొత్త పెండ్లికూతురుగ సుమంబు
దాని చెక్కులందు తడబాటు సొడబాటు
సరసు డయినవాడె యెఱుగగలడు. 13

పూవు నాదు గాని నావిచ్చు కనులు నీ
యాస్య మరయగల్గి యంతవఱకె;
మఱపు గాలిపాలు; ఫలమెప్పుడయినా నీదు
సన్నిధియె మదీయభాగ్యసిద్ధి. 14

విత్తునుండి పన్ను వెత్తి చూడగలదు;
పూయగలదు; చెట్టు కాయగలదు;
నీడనీయగలదు; వాడిపో గాగల;
దింక దాచుకొన్న దేమికలదు? 15

ఎంత హేమ మెంత హేమవిద్యుద్రస
మీ యుషస్స్రవంతి నింకిపోయె?
మొయిలు లోన నిద్రపోవు తటిత్కన్య
కలలు వోలె తారకలు స్ఫురించు. 16

పులుగు చెక్కుసవ్వడుల వోలె గుండెలో
గాలి విసరు లెల్ల మేలుకొనియె
మేలుకొలుపు లోనె లాలిపాటగ నేదొ
క్రమ్ముకొనగ సాగె కమ్మదనము. 17

అప్పుడాడు వచ్చి చప్పట్లు గొట్టగా,
నిప్పునెలత మోము గుప్పుమనియె
కీకురాసి కంట బాకుపోటు విధాన
వెలుగు రక్తమయ్యె నలుపునలుపు. 18

లక్ష సూర్యమండలముల గోళంబుల
మినుకు మినుకు మినుకు మనగజేయు
నంతరాళమంచు నంధకారముపాలు
హెచ్చె, వెలుగు పాలు హెచ్చె సృష్టి! 19

తలిరుటాకు జిలుగు జలతారు మేలిము
సుంగు జార్చి మనసు దొంగిలించి,
యరుణకిరణములకు నందిచ్చెడు కిలాడి
ఈ యనార్యులిని క్షమింప వలదు! 20

ఎగయు దిగులు పేరె పొగమంచు దిగుచుండ
మనసు మీద కప్పు మసకముసుగు
జగతిలోని మనసె పొగసెనా అన్నట్లు
మనసులోని జగమె మాసినట్లు. 21

చాలు నింక నిద్ర పూలార తెండంచు
పాడె మేలుకొలుపు వానచాన;
కనులు నులుముకొనుచు ననలెల్ల కనువిచ్చి
ఒడలు విరిచి నవ్వు తొంతబోసె. 22

తమ్మిచెలియసామి గమ్మత్తు పనివాడు
గెంటినాడు చీకటింటి తలుపు
ఎన్నిపూలు; రంగు లెన్ని మ్రోతలు వచ్చె
ఎచటదాగియుండె? చింతపడను?. 23

పువ్వు లెల్ల నెఱుగు నవ్వుసవ్వడి వేళ్ళు;
పింతకల లెఱుంగు పిరి గులాబి
దానినవ్వు రేకతో నంతమైపోక
ప్రకృతి వాని బెట్టె చక్కిలిగిలి. 24

నీవు పూచుదాక పూవ! నీ తావుల
తల్లి కడ నెచోట దాచితమ్మ?
తల్లిప్రాణమిల్లు! తావికి పన్నెకు
ప్రాణములకు నిల్లు పచ్చదనము. 25

అకరు లెల్లనిక్క అరకంట నొక మొగ్గ
పగలు బయలు చూచి పక్కుమనియె
రిక్క కేసరముల; దిక్కు రేకులు విచ్చు
నింగిపూవు గని మునింగె దమిని. 26

మఱపువేళ్ళ దన్ని, మేఘమాల పొలాల
వానతీగ లెల్ల వ్రాలె నేల
మన్ను విడువకుంట మాఱు జన్మము నెత్తి
తీగ లెల్ల తిరిగి దివికి సాగె. 27

ముప్పటమ్మ పఱచి దూదికొండలలోన
నిప్పురవల తీగ నిలిపినావు
సెగలు పొగలు రేగ నినికించితివి ఝల్లు
జలద! లాభమేమి గలిగెనీకు? 28

నింగిమూపు మీద వంగె నింద్రధనుస్సు
క్షితిజగుణము తెగ బిగించి, లాగి,
కిరణమెక్కుపెట్టి తరణివిల్కాడు వే
టాడసాగె, మేఘహరిణములను. 29

సగము మత్తుకనులు, సగము జాఱిన కొప్పు
సగము విడనియూర్పు, సగమురాత్రి
సగము సున్నయగుచు, సగము జాబిలిగొంచు
నెచటి కేగు చుంటివే? నభమ్మ! 30

సెలవివాఱునవ్వు సెలయేటి నవ్వులు;
శిలలు బుజములెక్కి చిందులాడు;
చిందులాడు శిలలు సెలయేటితో నవ్వు
నవులమారి బతుకు నదుల బ్రతుకు. 31

జాబు కడమదాక చదువుకున్నది చాన
కన్ను లెఱ్ఱనయ్యె మిన్నులల్లె
కన్ను లెఱ్ఱనైన, మిన్ను లెఱ్ఱనైన
కాఱకున్నె వాన ధార లగుచు. 32

వాక మప టమున దోక నెత్తి పరుండె
పోసె- దాని పైన దొమసాని-
సాని సొగడియు కూనిరాగమె చెప్పు
మప్పటమ్ము క్రిందఁ జిప్పలెల్లి. 33

వేల పయిన నిలిచి నిక్కువానికి మబ్బు
వాగు దాగు పడిన కాగితమ్ము
గాలిలోన మబ్బు గది తేలువానికి
బంగరాల రువ్వు పర్వతంబు. 34

మూగమంచు లోన ముసుగుదన్ని పరుండి
పిండిమంచు లోన గుండెజాఱి
ప్రొద్దు పొడవగానె నిద్దుర విడినట్లు
తలుపుదెఱచి వచ్చె మల షికారు. 36

కొండపైన వాన్ని కూర్చున్న వెన్నెలమా
నడుమ రాజు పెద్ద నల్లగుండు
గుండు వాతి మీద కూర్చున్న కొకరాకి
కాకి నెత్తిమీద నాకసంబు. 36

మెలికలౌను పాము వలె పర్వు దవులకు
కోన కడుపునుండి కొండవాగు
అద్దమట్లి పావ లరయుచున్నవి దాన
గట్లమీద నిల్చి చెట్లగుములు. 37

పచ్చదనము నిచ్చు, పల్లానికేపొచ్చు,
లోటులెల్ల బూడ్చు నీటితల్లి
నిండియున్ దాని నెలుగా గావించు
మింటికెగురు నామె మంటకొడుకు. 38

గసకు గసకు మంచు జలతరంగిణిమెట్ల
చెలమ నీటిపై నిశీథివేళ
మంచుబొట్లు పల్కరించుచున్నవి; గ్రుక్క
పట్టె నీలకోడి పాటకత్తె. 39

జీవులెల్ల నిద్రవోవునప్పుడు తెప్ప
లార్పకుండ జూతు వర్షరాత్రి
తిరుగ జగతి లేచి తిరుగాడ గడగుచో
ముసుగుపెట్టి నిద్రపోదు వెట్లు? 40

ఇరుల దట్టమైన పరదాలు పదమైన
దాకునంటి నెలను లోకువెకద
కడలి యెంత నిడివి పొడవులు గలదైన
నౌక తెడ్డ వడికి లోకువెకద! 41

కంట బడిన దెల్ల గ్రసియించు చున్నాడు
తరతరాల నుండి ఇరుల నినుడు
సృష్టి చీకటులకు నష్టి లేదొకొ యింత
అంతకంత పుష్టి యగుదెకాని. 42

కన్ను విచ్చిచూచు కలువపూ జవరాలు
మురుగునవ్వు; పిల్ల తరగ లెగురు;
నింగిపై బరున్న నెలవంక కంటిలో
నలుక విచ్చి క్రమ్ము నల్ల పొగలు. 42

పగలు చూచిగాని పక్షుల రొదకాదు
మాపు రేయిశాంతి మానవుండె!
మలల శిలల నొత్తిగిలిపోవు సెలయేటి
నడ్డుపెట్టి చూచునది నరుండె! 44

అంతులేని దేవు డాకాశ మనుపెద్ద
కంట జార్చి విడిచె కడలి బొట్టు
సంతసించినపుడు కాంతు లీనుచునుండు
దిగులు పుట్టినపుడు పొగలు రేగు 45

పవలు మీద బడిన పదము సవ్వడు లెల్ల,
సద్దు లేనిరాత్రి పద్దువ్రాయు;
మూగ ఓరుపెట్లొ మూగ చేతయు నట్లె
నోట మాట లేదు పాటకెపుడు. 46

కోకిలమ్మ గొంతు కోటి పిల్లల గొంతు
ఎందు మారు మ్రోగునపుడె తీపి
ఇనుని చూపు బల్మి నసల బుగ్గల నుల్మి
కంద జేసినపుడె కనులవిందు. 47

చినికె నార్ద్రరాత్రి చింత బుల్లనిపూచె
మూల కాడి మేడి మేలుకొనియె,
ఒడలు విరుచుకొనియె; మడియావులించె; జ
డ్డిగపుగింజ ఆవు మొలకపోటు. 48

పసిడి పొట్టలున్న పైరు మాలాంత్రను
జాలియైన లేక కూలఁబోయి
గాలి దంట జూచి, కటికవాడని తిట్టి
కోర చూపు చూచె కొడవలిమొన! 49

భూమి పయికి లేచి పొడుగుకాదను పూచు
పూవె గాలితోన దేవులాడు;
భూమి నంటియున్న పూవు తేకులు వంగు
చున్న- ఉన్నకడనె తిన్ననగును. 50

గుబురు మాటులోన కులుకుచున్నానని
తలచి దాబు వూవు తెలివిలేని
కన్నెపూవు; తనదు కమ్మసితావియే
తనకు ముఖ్యశత్రువని తెలియక. 51

కదలు వెలుగు-నెలుగు- కలగాపులగ ముషో
రాజధాని లోని మేజువాణి;
పిట్ట పిట్టగొంతు పట్టి వేయుగ దాన
నేర్పరింప జూచు దెంతవెట్టి. 52

పసిడి ధాన్యమెల్ల పడదోచు కున్నారు
పాటినేల మనసు బీటవాతె;
పోయె నెటకొ పొలమ! పొలిగా డికేటికే
కోత దుబ్బు మీద క్రొత్త చిగురు? 53

మండుటెండ కాసె నెండుటాకులు రాలె,
గాలిసోకి కొన్ని కదలసాగె;
సద్దులేక కొన్ని జరిగె మెత్తని నేల,
శిలల దాకి కొన్ని గలగల మనె. 54

గాలికడుపు మీద గంట్లు పెట్టుటకునై
పులుగులును విమానములును లేచె
చిత్రమెల్ల జూడ సృష్టి వేచియెయున్న
దిత్తు వెవరికయ్య మత్తుమందు? 55

సృష్టికర్త విధికి చెప్పు గట్టి జవాబు
తఱుక లేని గడ్డి పరకలేని!
పాలలోని వెన్న పాలు దానికి సాక్షి
ఆవు కడుపులోని అగ్నిసాక్షి! 56

ఇంటి దూలములకు నెత్తించు కొందరో
డెందమలర పండ్లు తిందురొక్కొ
ఎల్ల తోటలందు జిల్లేడు కట్టలే!
గాలినిండ దాని తూలకములె! 57

వందమంది లోన వందమందికి నచ్చ
నదియు సొగసె, నచ్చు నదియు సొగసె
నచ్చువాని మనసు నమలివేసిన సొంపె
నమల లేని వాని వమన మగును. 58

భావమునకు లేదు భాష; భాషకు లేదు
భావ మొకడు జననపత్ర మందు;
భాష కరపరాని భావంబు లవియెన్ని?
భావ మెఱుగరాని భాషలెన్ని?? 59

మగత వెన్నెలందు జగతిని ముంచెత్తి,
సాటి తారకలను మాటుపెట్టి
సందెవేళ వచ్చి సందర్శనం బిచ్చె
మందయాన వోలె చందమామ. 60

జీబు చింత చెట్ల దోబూచు లాడుచు
రెండి లిక్కి వోలె వేచియుంటి
చేలనోయి' యిదిగొ' నూలుపోగికపొమ్ము
సందె ముసిరె విదియ చందురుండ' 61

బుద్ధిజీవి నరుడు, బుద్ధిమాలి యొనర్చు
యుద్ధములను పూరణోత్సవములు,
ప్రకృతి కారణముగ ప్రభవిల్లె నని యెట్టి
కోకిలమ్మ పైన కోపగించు. 62

చల్లని నెలకాడ' చెల్లని రూపాయి
బిళ్ళ వైతి వింక వెళ్ళుపొమ్ము!
అగ్గిపుల్ల కంటె నధము డైనట్టి యా
కుముదవైరి గూడ గొంచుబొమ్ము. 63

ప్రకృతి యాగడముల బట్టి మూలకు నెట్టి
మానవతకు రాజ్య మకుట మిడగ
విప్లవధ్వజమ్ము విప్పితి మికమమ్ము
తాక జనదు ప్రకృతి లేకిమూక! 64

అల్పగుణము వాని నధినుండు తెగటార్చు,
అగుణి యైన వాడె నెగడ జేయు
చుక్కల న హితు వోలె సూర్యుండు పోకార్చు
ఇరులు మెఱయ జేయు హితుని వోలె 65

**

## ఆధరాన పద్ధతి

ఓ ప్రభూ! ఇకెన్ని యుగముల నడక నా
పేద నొసట వ్రాసి పెట్టినావు!
ప్రాపు దొరకదయ్యె నూపిరి రాదయ్యె
గండరించుచుండె గుండెబరువు. 66

చూపు వెలుగు తోడ దీపకళిక నెత్తి
వెదకుచుంటి నిన్ను విశ్వమూర్తి!
ఇది తుఫాను గాలి; ఇది మేటి జడివాన;
ఇది సముద్ర; మెంత ఈదగలను? 67

మనసు సూది గ్రుచ్చుకొనుచున్నదే కాని
నిన్ను గానలేక యున్నదయ్యో!
అన్ని యెడల నిండి యున్నట్టి వాని నె
ట్లొక్క యెడనె పట్టి నొక్కిచూతు? 68

అందునిందు గలవ టందురు స్వామి! ని
న్నెందు వెదకి చూతు: డెందమందె
నలుసు వోలె ఎటనొ నక్కియున్న నినుం గ
నుంగొనంగ లేక వెంగలినయి. 69

నీవు నాదు గుండెపూవు వైసను, స్వామి!
వలపులీను దాని ఫలము కొఱకు
వెదకుచుందు పుట్టి పెట్టినై గ్రుడ్డినై
గుండెపట్టు విడిచి యుండెదలనె! 70

సద్దు చేయుచున్న సరుగుడు చెట్లతో
సాగరమ్ము పిల్కి మూగపలుకు,
నీలపాట వోలె గాలి నీవార్త
పిడుకు సొరుపడాను తుపల సా[illegible] 71

ప్రతిమ దానె చేసి; ప్రతిమనే పూజించి,
ప్రతిమ పైనె తనదు భక్తి నిలిపి,
ప్రతిమ భావమందు, చిత్తనెక్కి ప్రతిమయై
కన్ను మూయ కాత డున్నవాడు· 72

వినిగె నభయహస్తి, వ్రేలాడుచున్నది,
నగము బిటవాటి మొగ మదెల్ల!
ఎవరు చూడ గాని యీ పాడు గుడిలోన
వేచియుండ నేల? విగ్రహమ్మ! 73

తూచితూచి వేసి తాచార్యవర్యులు
మాచిపత్రి త్రిలోకమాత మీద
స్వామి వారు లేచి శఠగోపముండాల్చి
పయనమైరి ద్రోవ భక్తతతిని 74

వెంకటేశు నొద్ద టెంకాయ గొట్టబో
నడిగె నర్థరూప్య మర్చకుండు
పగుల గొట్టి కుండ ఫలము స్వాహాయంచు
గొంయ బోయె నతడు సందిలోన. 75

ఇనుని వంటి దివియ నిచ్చినా, మా గ్రుడ్డి
కనుల కెదుటి రూపు కానబడదు.
దొరకి నట్లె యుండు నరిగిన కొలదిని
పాఱిపోవు క్షితిజ మారమునకు. 76

వటి ఱాల తోడ గట్టిన దేవాల
యంబు వంటి నా మనంబు లోన
నిను ప్రతిష్ఠ చేసితిని గాని నా కది
అప్రతిష్ఠ గానె యయ్యె దేవ! 77

•*•

# సంకీర్ణ పద్ధతి

ఉన్న పాతకాని కౌక జెజ్జమును వేసి
వెదురుపుల్ల గ్రుచ్చి కదురు చేసె;
వడకు జందెములను వ్యాపారమును జేయు
బాపుకొను ఋణాలు బాపనయ్య. 78

ఉత్త నగరు లోన నుత్తుత్త వీధులు
నుత్త వీధులందు నుత్త ఇండ్లు
నుత్తయిండ్ల చిత్తమూరించు ప్రియురాండ్రు
జెల్లకాయ తీర్చె కల్లువత్తు. 79

లోతు లేనియట్టి నూత గెంతగ నేల?
మక్క విఱిగి మంచ మెక్కనేల
వంటలక్క బాధ వదిలించు కొనబోయి
పడితి వంటె మగడు పడుపెకాక 80

తొంగి లేవలేడు, వంగి కాశికి బోయె,
భార్య మీద కినిసి భర్తగారు,
మఱిది విశ్వనాథ మెఱుగడే వనిన మాం
గల్యబలము సన్నగారి బలము' 81

ఆకు లమ్ము దాని పాక పీఠము వేసె
చంక దుడ్డు తోడ సాధు వొకడు
అడ్డమైన పచ్చనాకులనే మెక్క,
ఎండుగడ్డి మేయు దెపుడు మేక 82

చిక్కనైన గాలి ముక్కు రంధ్రము లందు
కాపురమ్ము చేసి కైపుగూర్చె
మనసు లోని నీడ మాత్రము కొండలు
దిబ్బ లెక్కి తిరిగె మబ్బువోలె. 83

చిమ్మ పీక ఊపుచు, పెట్టెకి – మామిడి
పండ్లు కోసినాడు పసుపువాడు;
తేనెతుట్టె మాట వానికేమి తెలియు!
వాచిపోయినాడు జూచిపోరె. 84

ఆలి యొల్లనట్టి అప్పటి యేండ్లలో
పురుషు డొల్లనట్టి ముప్పదేండ్ల
పురుషు డుండె; వాని మఱచిపో ద్వాదశా
బ్దములు పట్టె సతికి వార్ధకమున. 85

తాత యడుగు లందు తనతండ్రి యడుగులు;
తండ్రి యడుగు లందు తన యడుగులు;
తనదు నడుగు లందు తనయుని యడుగులు;
నాటి యడుగు లందు నేటియవియు, ౮౬

చెదలు పట్టె గుజ్జు; మదురు పైబడి కూలె;
పెట్టె పుస్తకాలు మటి యయ్యె;
దాపు వెట్టరమ్మ తామరా కడ్డాకు
ద్వారబంధములకు దారువులకు! 87

తేరగా లభించె దారిబోయెడు వాని
కంచు దోచుకొనకు మదియె పనిగ-
ఏత మెత్త నెత్త నెందాక గడనిల్చు?
నిలుచు నూతి లోని నీరమేని? 88

కలియబెట్టినాడు గన్నేరు వేళ్ళతో
మూసపెంకు లోని సీస మెల్ల
పచ్చబడను లేదు పసిడియు కాలేదు
పెండ్లికొమిరె కేమి పెట్టునితడు? 89

పెదకి ఇచ్చి నట్టు ముదియప్పలకు గూడ
దొరకినాడు నేడు చిఱుతవాడు!
రెకి బ్రదుకు నాది నాకర్మ మిదియేమి
పండు గపుడు కూడ పాత మగడె! 90

జనరు కండె చుట్టి తగడు గుజ్జుపుతోక
పెండ్రుకలను చిన్ని వెదురుపుల్ల
బోటుపెట్టి యుచ్చు మాటనా డేనాద;
తుఱ్ఱు మనియె పిట్ట తోకజూపి. 91

పోలి స్వర్గమునకు బోవుచున్న దదిగొ!
కాలు వందు దీపమాల దేలి;
తరగ లందు నూగు నరటి డొప్పల చుట్టు
జేరి యీతలాడె చేప గుములు. 92

కొమ్ముతోడ వ్రాసె గోడపై కవనంబు
దొడ్డి బురదగుంట బుడ్డి ముంచి;
గడ్డి దొరకదాయె కాగితాలను మేసె,
నాది కావ్యములను గేదెపడ్డ. 93

పడుట కోస మగును పట్టాలు దప్పుట;
అగ్గికోస మగును బొగ్గుమేత;
చీకటిని తుఫాను గైకోని పైల్వాను
జాలు దిను శిఖండి రైలుబండి! 94

బల్ల పగులగొట్టి గల్లంతు చేయు నో
పదరుబోత! వినుము వాస్తవమును;
మెండు వినగ చెవుల రెండిచ్చె దేవుండు
తక్కువగ వచింప నొక్కనోరు! 95

అమ్మవారి మచ్చ లట్లున్న గోతులు
నేడు బయట బడియె నీ మొగమున,
చంద్రవదన యంచు సఖి నన్నుచో చంద్ర
చెప్పుదెబ్బ లింక తప్పబోవు. 102

సౌమ్యవత్సరాన చంద్రవాసరమున
సౌమ్యకాంత మీద సౌమ్యరహిత
మైన సాహసంబు మానవుం డొనరించె
చెనకి యామె కన్నెతనము చెఱచి. 103

వర్ణనలకుగాను వంపులు సొంపులు
పిచ్చి కవుల కెల్ల నిచ్చి చెలియ!
మిగిలి నట్టి వట్టి డిగుడాయి సరుకునే
కొంచు రమ్ము! అదియె కోట్లుచేయు. 104

పావురాయి తెలుగు పలుకు చెంబెదవుల
పన్నెకళ్లు జాజి సంపెఁగ నిడి,
నూరి, గానరసముతో రంగరించిన
అరవమాత్ర మ్రింగు డయ్య! దీని. 105

దుముకు లెందఱున్న విమల మోమెత్తదు,
నిన్నుఁ గూర్చి కంటనీరు గార్చు,
చేతగాని మగని సీతగా నగునొక్క
తారకేవ కొఱకు తారయగునా. 106

పెదవి కొఱికి గంటు పెట్టెడు దాక నా
కుపమలోని రక్తి యుబుక దయ్యొ,
తరుణి దంతపంక్తి దానిమ్మ గింజల
టంచు బోల్ప నెవ్వ డనుమతించు? 107

మొద్దునిద్ర నీది యద్దరాత్రి దాక
ప్రక్కగదిని ఒకతె పక్కపకలు;
ఆమెగారి పడక అక్కతో కాదట'
పగటి వేషగాని భాగవతము. 108

రాగలహరి నామె రేగుప్తి కేటికో
మధ్యమస్వరంబు మప్పుడప్పు,
అతడు మధ్యమంబు నంటకే ఆరోహ
ణావరోహణముల త్రోపమాపె. 108

ఇరుల మొగము మీది సిరినెల్ల చూపించు
కాంతి జగమునందు కానరాదు;
మౌనగానమందు మాధుర్యమును వ్యక్త
పఱచు శ్రుతులు కృతులు నెఱుగరావు. 110

నవ్వుచుండె కాలిమువ్వలు వినుజాచి
తాన తనన యనుచు శోనసుండి,
మూసియున్న గదికి పైసాయె వేగంబు-
వీధిలో నడాడు వెఱ్ఱివాడ' 111

పాటలోని బిగువు పట్టక శ్రుతికంచు
తీగ లాగి లాగి త్రెంచుకొంటి;
ఎందొ దాగి పాడు ఇలకోడి గీతి కా
కసమె శ్రుతిని లయను గలిపె నౌర! 112

కంటి ధార నుండి కారెడి ముత్యాలు
విలువ గట్టగల ప్రవీణు డెవడు?
మనసు పట్టు దారమున వాటినిం గ్రుచ్చి
కలికి మెదను వేయ గలుగువాడె. 113

తొండ నోటిచావు నుండి కాపాడినా
డలరుదేనె నాను ఒకచిలుక;
పట్టి తలను త్రుంచి పట్టుపొత్తపు పొన్ను
గూర్చె మొండెమును కళార్చకుండు. 114

ఒకడు మబ్బు మెచ్చు; ఒకడు తుంపర మెచ్చు;
ఒకడు వాన మెచ్చు; ఒకడు జల్లు;
తడియు నొకడు మెచ్చు; గొడుగు నొక్కడు మెచ్చు;
పరులు మేఘ ముఱిమి కురియునపుడు! 115

ఆకులోని పూవురేకు దాగుడుమూత
కన్నెపడుచులోని కలికిదనము;
కలికిదనపు రుచులె వలరాజు వలపులు;
ఉత్తకవిత లూదు వత్తిపొగలు. 116

పిచ్చి పద్యములను హెచ్చుగా వ్రాయకు
నవ్వులమారి గాకు కవివరేణ్య!
కనుల నెత్తి చూడు, కవ్వించి వనకన్య
నిన్ను నవకు చూపు చుక్క దగిగా! 117

విశ్వకోశమందు బీజాక్షరము వోలె
బ్రహ్మ చేసినాడు పనసతొనను.
అందులోన గల దనాహతనాదమ్ము
అందులోన గలవు స్పందములును. 118

స్త్రీల నవ్వు పగల పూల నవ్వుల తోడ
పోల్చి కవులు మోసపోకు డయ్యా!
కలికి నవ్వులేదు కపటంబు లేకున్న
ననకు కపటమున్న నవ్వెరాదు. 119

***

# శిల్ప పద్ధతి

బండకాతి మొద్దు గుండెలో బందియై
దాగియున్న దేవ! మూగకోర్కె
ఉలిని మోపి దాని గిలిగింత లిడిచూడు
మాత్రలోని రూపు లరయ గలవు. 120

కలదు కలదు కల దొకానొక పెనుకొండ;
కొండ కడుపు క్రింద బండకుదురు;
పదుటి క్రింద పెద్దగుహ; గుహలోన స
రస్సు; దానిలో నభస్సుమంటు. 121

చేసినాడు కుంచె; సేనాపతి వరాలు
తీపివేళ్ల నెల్ల సాపుచేసి
నాడె లటుక లిటుకు లాడునేగాని మ
గ్గాన చీర మటుకు గగనసుమము. 122

ముళ్లబాట పలవులు గ్రుచ్చుకోకట్టి
మొండిగుండె యొకటె బండబాఱు;
గుండెకాతిలోన కులుకు నచ్చరకన్నె
కులి తగుల్పకున్న నులికిపడునె? 123

పూర్వకాలమందు గర్వకేతన మెత్తి
కవుల మదుల మీద కదము త్రొక్కి,
రాజ్య మేలినావు; రతిరాజ! పోపొమ్ము
నేటి జగతి నీకు చోటు లేదు. 124

నాటి యూర్వశులును, నాటి రంభా తిలో
త్తమలు, నాడు గల మృగాక్షు లిపుడు
లేరు; మారశిల్పి! చేరెడు బిచ్చము
నీకు దొరక బోదు; లోకమందు. 125

***

## కాల పద్ధతి

పుట్టబోవు రేపు, పుట్టి గిట్టిన నిన్న
పొట్టలోనె పుట్టు, పుట్టి గిట్టు;
నిన్న పుట్టువునకు నేడు గిట్టుట కాక
నిన్న రేపు లేని నేడు కలదె? 126

ఊరబిడిక పైన యుద్ధాని కేగినా
నూబిగుంట లోన దూబినాడు;
ఊరు సహము కూడినారు కాని, మహాత్ము
కూడి బయటపడుట కొప్పుకొనడు. 127

లేక లేక పుట్టె లోకాయగాడొక
కాకిపిల్ల మీద కన్నువేసె;
కాకి కొంచుబోయె లోకాయగాడిని;
కాకి మహిమ కాదు కాలమహిమ. 128

రైలు కుదుపు వలన తూలి కాల్నిలువక
పైన బడ్డ వాని పట్టదెంత
గట్టిదానా! విడిచి పెట్టదా మగనాలి!
పడిన వాని తప్పు పడుచుదనము. 129

ఆరిపోయె మినుకడయ్యె నాకాశము;
ఆగిపోయె మ్రోగడయ్యె రాత్రి;
కాన కౌట కయ్యె కలవోసె బ్రతుకెల్ల,
అడ్డిపోయె గింజ జడ్డిగాన. 130

లేమ పంటిక్రింద కామంచి పండయ్యె
పుట్టి పెటిగినట్టి భూతకోటి,
కాలవక్త్రమునకు గాలమ్ముగా నయ్యె
పుట్టి పెఱుగనట్టి భూతకోటి. 131

నిదుర రాని రాత్రి నీవు వచ్చితి వైన
తలుపు గడియ తీయ కలిగి కూడ
యుంటి నల్లె; దీప ముడిగిపోయె: ఓరాన
గడప దాటిపోయె గడియ లెల్ల. 132

రేపు మాపు మీద తీపి దేవు లెఱుంగం,
చప్పనైన గంజి చాలు నేడు;
వేళయయ్యె నింక నాలస్య మేటికే
వామి మీద కూసె జాముకోడి. 133

ఎన్ని యుగమహస్సులే హిమశిఖరాల
పూడి యున్న పిల్లె గూడుకట్టి:
భానుకిరణ మిందు ప్రాలి నిద్దురపోవు;
కరుణరసము ప్రాకి కరిగి కరిగి. 134

ఒకని మేప మంచుకకి [illegible] తలుపులు,
పెదవి మీద పెలుపు ప్రేమకనకు,
పచ్చపసిడి తిప్ప లిచ్చు యాచ్ఞకకి,
రాల చేత కనియె ఒంటి కిట్టి. 135

రయము తోడ వచ్చు రాకెట్టులం జూచి
పాఱిపోదు రేమొ దూరములకు,
శనియు, బుధుడు, సూర్యచంద్రగ్రహంబులు
త్వరగ జాతకంబు వ్రాయవయ్య. 136

మైలుఱాయి తోడ మాటాడివచ్చితి
కాలిచెప్పు తోడ కలలుకంటి
రోడ్డు పొడవు తోడ లోకాలు కొలిచితి
నన్ను నేనె కంటి నన్నిచోట్ల. 137

*.*

## ఋతు పద్ధతి

వానకాల మతని తూనీగ వలె చేయు,
నామె మానసమున కంచమగును;
గాలి వేల్పు పతని నాలుగు చెక్కలు
ఆమె రెండు చెక్క లంట వసలు. 138

తావి, రంగు, భంగు త్రావి పూలింటికి
మఱలిపోవు దారి మఱచిపోయె;
వెలుగు చీకటులను వెలలిచ్చి వానితో
వర్తకమ్ము చేసె నార్తవమ్ము. 139

ఫెళ్లు మనుచు గాలి వీచె రాత్రిపూట
ఇంటిమీది పెంకు లెగిరిపోయె;
ఒడలు మఱచి నిదుర నూగాడు పూబోడి
చీర ఎగిరి పోక ఊరుకొనునె. 140

మిట్టి మిట్టిపడుచు మేటి నయాగరా
పాత మట్టు క్రింద బడితివికద'
మట్టి కింత పొట్ట గొట్టి గిట్టితివేమె
తుట్టతుదకు వానబొట్టు! నీవు. 141

చిమ్మటలును చిన్న చిన్న చిల్లర కప్పు
పంట రుంజ దరువు పట్టుచుండ
ద్రాద ద్రాద యనుచు బోదురు కప్పయే
ఢింకరించె దుందుభిస్వనంబు. 142

చుక్క చుక్క లుంచి చక్కగా ముగ్గులు
వ్రాసె నీటి మీద వాన నెలత
ముగ్గు లచటనుండి మొనలుసాగి నదీమ
తల్లి తనువు నెల్ల నల్లుకొనియె. 143

పసరుమొగ్గ వోలె, ప్రసవించు సల్లవోలె,
అమ్మవోలె, ముత్తియమ్ము వోలె,
గుమ్మటమ్ము వోలె, కులుకు నర్తకి వోలె,
చిందులాడె వాన చినుకుసోన. 144

ఖడ్గమృగము మీద కాముండు పూముల్ల-
పఱపినాడు; దొర తుపాకి గుండు;
అడవి నెల్ల నొకటి యట్టిట్టు గావించె
ఒక్క వోలె నొకటి త్రుళ్ళిపడియె. 145

దయితు కనులలో నిదాఘమ్ము జ్వలియింప
నాతి కనుల శ్రావణమ్ము వచ్చె;
స్వామివారి మదిని హేమంత ముదయింప
చేడె మనసు లోన శిశిరమయ్యె. 146

వచ్చె నపర సంధ్య; వనితకు తెలియని
చిగురుతోట లోన నెగురు నపుడు;
మాటలాడి పోయె బోటి కర్థము కాని
భాషలోన ప్రసవ ఘోషతోడ. 147

అంటరానితనము నంటించి రెవరికో
సత్య మెఱుగనట్టి జనులు; పెండ్లి
కాని కాంత లంటరాని వారదిసరే;
ఐనవారు నంట రానివారె'!! 148

సూర్యకరసుధాగ్ని సోకులై తనువెల్ల
పులకరించుమన్న పొలుపు తోడ
విప్పళించుకొనెడు విరిరేకల విలాస
మాయు వల్పమైన అమరసుఖము. 149

***

# లోక పద్ధతి

ఇంద్రచంద్రు లెంద తెన్నాళ్ళు మేసినా
తఱుగ దీ యనంతధాత్రి గడ్డి;
దిక్కు లేని ఒక్క బక్కచిక్కిన ఆవు
నాలు కంపె నేని కాలిపోవు. 150

కలుగువాని భార్య గాడిదతో బోవ
నోము యజ్ఞ మనిరి స్వాములెల్ల;
లేనియామె మగనితో నిద్ర పోవంగ
లోకమెల్ల చేసె కాకిగోల. 151

నిన్ను పంపివైచి నీ తోడ నేకాంత
సుఖము కోరుకొంటి సొగసుకాడ!
వాకిటిమొగ నిల్చి, లోక మెల్ల తెగించి,
తలుపు గొట్టుచుండె దబ దబ దబ. 152

కోమలాంగి పైన కొండెముల్ చెప్పెడు
వాడు చేతగాని వాడె నిజము;
కౌతుకవలసివచ్చె పతిదేవుడవు కాన
మాకు తెలియు నామె మంచితనము. 153

నాకు తోచునట్టు లా కాలమున నంతె
నీకు తోచరాదు లోక మెల్ల
ఎవని కలలు వానివే! కాని అన్యులు
తలచుచుందు రవియు తమవెయనుచు. 154

గాజుకాయ వంటి కనకాంగి మనసులో
ప్రేమ గొడవ తెచ్చి పెట్టినావు;
పఱుగు ఊల వంటి పడుచు వారల మధ్య
వనిత నొక్కరితనె వదలితేల? 155

రేపు మాపు కూడ రూపాయి అంచుపై
తిరుగుచున్న దిపుడు ధరణిదేవి,
విష్ణు తిరుగనేల! తీర్థయాత్ర లటంచు
వెర్రి నరులు విశ్వవీథు లందు. 156

డాయి రప్పవిలువ ప్రాణాలకే లేక
పోయె; మనిషి రక్త మాయె రుచిగ,
తేనెకంటె, పండు తీపి కండెను, భార్య
మో వికంటె, పొరుగు మునితకంటె. 157

పడుచు వయసులోన పాలిచ్చినన్నాళ్లు
పెట్టినాడు మేత పొట్టనిండ;
పాలు వట్టిపోవ పాపిష్ఠి ఆసామి
వెట్టివాని వెంట నెట్టినాడు. 158

కొడుకు పనసకాయ, కోడలు పెంకాయ,
అత్తగారు మద్దు కత్తిపీట,
పూట పూట తండ్రి నోట కరకాయ,
బమ్మగారి వీట దొమ్మరాట. 159

శిలయు నఱిగిపోవు చీమ కాళులుదాకి,
ఉండియుండి పెఱుగుచుండు బండ,
నడచి తరువు లూళ్లు నాళ్లు త్రిమ్మరివచ్చు
పేదతీగ మింగు పెద్దపులిని. 160

ఉదర లోక మొకటి; మదన లోక మొకటి;
బయట కానబడు ప్రపంచ మందు;
మదన లోక సార మర్మజ్ఞు లగువారె
ఇహము నందె పరము నెఱుగ గలరు. 161

*.*

## శాస్త్ర పద్ధతి

ఒక్క సూర్యు డెన్ని ముక్కలై ప్రేలెనొ,
చుక్కలయ్యె వింత యక్కరాలు,
నింగి పంక్తిపై గుణింతమ్ముపకు గాని
కాలభావకేని గణనలేదు. 162

చుక్క లెన్నియైన ఒక్క ఆకాశమ్మె;
వాగు లెన్నియైన వాన యొకటె;
గూన లెన్నియైన లోనిమట్టి యొకండె;
భేద మెంచుపది కబోదికన్నె 163

ఇరులతోడ నిరుల నెంత మర్దించినా
కలుగనేర దింత జిలుగు వెలగు;
ఎంత సన్ననైన ఇనుని బాహువునేని
చీకటిల్లు సృష్టి చేయగలదె? 164

అణు రహస్య గాన మందున్న ఏకాంత
శాంతిలోని సుప్త సాగరమ్ము;
ఆకసమ్ము లోని ఏకైక తారకా
యోగనిద్ర లోని జాగరమ్ము. 165

వాస్తు శాస్త్ర మందు వాదతి ఘటికుండు
శూల లంట అడ్డు దూలములట;
వెన్నుపోటులంట; చిన్నమ్మ గారితో
మీద కెక్కి కొలుచు మేడగదులు. 166

కుజుడు, శనియు, తేలుకొండిపై నున్నారు;
అయ్యగారు పుట్టినపుడు; శని న
వాంశ పైన శుక్రుడు; దమ్మగారి; కికేల
ఆడు మగ విభేద మామె యెపుట! 167

***

# సహజ పద్ధతి

పుట్టిగోడ పెట్టి కట్టినా వొకమేడ
పెట్టినావు పురుగు పీస్గులందు;
కనులు తెఱవలేక కదలు బిడ్డల పీడి
ఎందు బోయినావె కందిరీగ! 168

స్వర్గమునకు బోయి సొంబారుతో నిక్లి
కొలకు జగడమాడు సరసవాడు;
గొడ్డుకారమునకు గోంగూరకై ఇంద్రు
తలను పగులగొట్టు తెలుగువాడు. 169

చౌటిబీ డటంచు పాటిపొల మ్మంచు
వారలేదు నీకు వారిదంబ!
మాలవాని కైన నాలుక దడుపగా
నీరువోయ మాకు నేరమగును. 170

కలుగు నంద మందె కవ్వించు జాతియు
వెఱ్ఱి మొఱ్ఱిదైన గొఱ్ఱె జాతి;
పెదవి వంచి నిన్ను పిలుచుచుండు గులాబి,
కుములుచుండు నర్కకుసుమ మెటనొ. 171

స్త్రీల కుండునట్టి శృంగార రసవాపి
దివము నుండి భువికి దిగుచునుండు,
పురుషులందు పొడము సరస స్రవంతిని
భువిని లేచి పొంగి దివికి పోవు. 172

గింజ వెనుక పండు; క్రీనీడగా నున్న
పిందె వెనుక పూవు; వెనుక మొగ్గ;
దాని వెనుక నున్న తలిరుటాకున పట్టు;
గిట్టుటగునొ? దాని పుట్టువగునొ? 173

***

## అసహజ పద్ధతి

సాగదీయ పైని సారణికా రాదు;
సడలుచేసి కాదు పంచమంబు;
ఎటు బిగించుకొన్న నే శ్రుతి కలియదు,
త్రెంప కేమి సేయు తీగ నతడు? 174

సాలెదార మందు వ్రేలాడు నెండాకు,
పచ్చి యాకు తోడ పలికెనిట్లు;
తిరిగి తిరిగి నేను దిశలెల్ల గననేర్తు;
నీవు మాత్ర మొక్క నింగివైపె. 175

రక్షణమ్ము కొఱకు రచియించుకొను నిండ్లు
పురుగులైన పెద్ద పులుగులైన;
భక్షణమ్ము కొఱకు కుక్షి నామక యమ
పురము నల్లు సాలెపురు వొకండె. 176

చిఱుగ నలిపి నపుడె కరివేప వాసించు;
కలచి నమలి నపుడె చెఱకు తీపి;
నలుప కూరకున్న మొలవవు ధనియాలు;
నలుపకున్న రాదు వలపుఫలము. 177

ఊరివారి సొమ్ము ధారవోసిన యట్లు
ధారవోసికొనియె తన సతికి,
తన్వి, దాని వలన దండుగ పడలేదు,
దండు గెట్టు లౌను; రెండు తలలు? 178

నన గులాబి తోడ ననుబుగ్గలను మోపి
కొనల నట్టు రాచుకొనెద వేల?
పూవు స్పర్శ వోలె స్ఫురియించు చున్నదో
మఱపురా నిదేదొ మనసులోన? 179

# నర్మ పద్ధతి

ధరలు కట్టరాని వరహాల ప్రాయంబు
దూబరా యొనర్చె తొలుత నెలత
మోట మొగము నిపుడు పాటబెట్టె; నెపంకు
పొలుపడు కొనంగ తోలికేని? 180

చేయి నాకెనంచు చీదరించు కొనంగ
పనియె లేదు నీకు బాటసారి!
అమ్మగారి కోర్కె యట్లున్న దనితెల్పు
చీటి వ్రాయగలదె సీమకుక్క? 181

జుబుకు జుబుకు మంచు నుబుకుల నుబికింప
వెలది పెదవి ముద్దు వీణమీటు;
నాగసారము కాయ మ్రోగింప బోతివో,
లేమ కంటిచూపు పాముకాటు! 182

కేల వెదురు కోల, కేకీక వీవన,
నూనెసిద్దె వంటి మేను, నిట్టి
అవకరాల చూచి ఎవతె శ్రీకృష్ణుడం
చెఱిగి యెఱిగి నిను వరించు సెట్టి? 183

నిన్న మొన్నదాక నున్నగా నున్నాడు,
కోడి గ్రుడ్డు వంటి కుఱ్ఱవాడు;
ఏటిలంక లోన ఏమైనదో ఏమొ'
జిగురువోయి పెంకు మిగిలినాడు. 184

హద్దుపద్దు లేని వమ్మాయి షోకులు,
గంగదాసు వట్టి దొంగనోటు;
జఱుగబోవునట్టి వరవిక్రయమ్ములో
చెల్లి దండుగేమి? చెల్లకేమి? 185

గోద లింటికాడ న్రైదు చూచితిమంచు
ఉన్నమాటె మీర లన్నమాట-
నాలు గందులోన పాలిచ్చు గేదెలు;
కదమ దొకటి రెండుకాళ్ళ గేదె'! 186

ఇంత మంచి పాప నెట దెచ్చుకొన్నా ర
టంచు తల్లి నడిగె నామె సకియ!
మంచిపాప కిటుకు మావా రెఱుంగుదు
రడుగ వమ్మ! వారి ననియెతల్లి. 187

పూవు నిమ్మటంచు పొలతి వేడె వరమ్ము
కాయ నిమ్మటంచు కాంతు డడిగె;
అదియు నిదియు నిచ్చె నర్థనారీశుండు
ఎవరి కోర్కె లెటు ఫలింపగలవొ! 188

కుంటి బల్ల మీద నొంటిగా శయనించి
కాళ్లు చాచుకొన్న కళ్ళజోడ!
అతని ముక్కు చెవుల కథికారి ననుకొన్న
మొదటి వేల భార్య, పిచపనీవు! 189

సిరి గులాబి మెడను వ్రేలు వంచి, బిగించి,
గొడుగు విప్పి ప్రశ్న మడిగె నతడు;
పెదవి విఱిచి, కురుల విదిలించికొని, యెదు
పది నొనర్చి, ముదిత బదులు పలికె. 190

ప్రతిఫలమ్ము కొఱకు ప్రాకులాడిన నాకు
అతివ! బూర్గుపండు వైతి వీవు
పైని మెఱుపు తోడ భ్రమలు గొల్పిన నీదు
బొండు గుండె నిండ ఎండు దూది. 191

చూరు నుండి జారు దారమ్ము పై నీగ
తాడి నెక్కు వాని నీడ చూచి,
పాడు కల్లు కొఱకు పీడెక్కు దివినైన
జనుల కేమి ఫలిత మనితలంచు. 192

ఇచట నున్న వార లెల్ల జ్ఞాతాస్వాదు
వులె! భయమ్ము వలదు; పొలతులార!
కలువ పూల యద్దకపు వీటి తెరలందు
స్నానమాడ నిచట సరసు కలదు. 193

మందబుద్ధి యైన మదనుం డొకడె నిన్ను
గెలువ దలచి వాడి ములుకు వేసె;
నన్ను చాటు చేసికొన్న నీ చాతుర్య
చర్య నత డెఱుంగ జాల డయ్యె! 194

అతివ కంటి నీర మవమానమును మోసి,
కాంతు నెడద పాల కడలి నింపె;
పాల కడలి వెన్న పాపాయి, వెలుగుల
తోరణాలు కట్టె వారి యెదల. 195

రాకరాక వచ్చి రాకేందుముఖి! నీవు
రాహుకేతువుల కరమ్ము లందు
పడితి వింక, నీకు పట్టు స్నానమె కాక
విడుపు స్నాన మగును గడియలోన. 196

ఇపుడు కాక యున్న నెండ కాలము లోన
అగ్గి గాడ్పు వీచు నపుడు; నాదు
తీపి మీస కొసలు నీ పంట జిక్కిన
పైన నీకు గుర్తు రానె? చెలియ! 197

*—*

# స్నేహ పద్ధతి

"ఎఱ్ఱ మద్ది చేవ కట్టె మంచము; దీని
కోడు విఱుగగొట్టినా డెవండు?"
"నాన్న! ఊరి నుండి నిన్న నీ వంపిన
పడుచు నేస్తగాని పని ఇదెల్ల!" 198

జేబు కాటువేసి చెక్కి తెచ్చిన పర్సు
పైన పేరు నేస్తగాని దయ్యె;
దానిలో ఫొటోల లో నాతని కరాల
తనియుచున్న దెవతె? తనదె! భార్య!! 199

మాయని యుషస్సు! మాయనీ మలిసంజ!
మాయకుండు గాక, మనకు చెలిమి,
దిక్కు లేని జగతి కొక్కటే జ్యోతిగా
ఇరులు ఇపుడు లేక వరలుగాక. 200

ముద్దుగుమ్మ తెఱచె ముద్దుల అంగడి
మొదటి బేరగాని మొదటి ముద్దె
సాగిపోయె నాల్గు జాముల పొడుగునా
ఆమె తీపి కాత డేమి చేయు? 201

చందమామ లోని చల్లని పన్నీరు,
లే గులాబి లోని మూగతేనె,
రమణి ప్రేమ తోడ రంగరించిన దిది,
పట్టుకొన్న విడదు, బ్రహ్మజిగురు. 202

తావి లోని మత్తు పూవు కాంచిన కల,
పసుపు పచ్చ వన్నె పసిడికి కల,
తేనె కన్న తీయ నైన నీ యధరంబె,
ఇంచుబోడి! నేను కాంచిన కల. 203

*.*

# అనుమాన పద్ధతి

కోడిగమ్ము చేసె; గోరాడె నదెచూడు;
వేగుబోక నుండి లేగదూడ!
గొరిజలో తగుల్చుకొని వచ్చె నెవరిదో
గడ్డివామి లోని గళ్ళరవిక! 204

పడుచుపిల్ల యట్టు పంచమ స్వరములో
నవ్వె నెవరొ గోడ కవ్వలి దెస;
అనుగు మగని పైన అనుమానమున చేవ
ఏగె—అచటి గొడవ లేల మనకు? 205

అర్థరాత్రి వేళ నైన అల్లరి వించు
ఎవ్వ రెవ్వ రంచు ఇంటిముందు
వచ్చి ఊరు సగము వారెల్ల పోగైరి;
చేడె ఎవ్వడంచు చెప్పు నిపుడు? 206

కలిపె నెడద బాస కన్నీటి చుక్కలో,
పెదవి రంగు లద్ది మెదిపె కలల,
కొలిచె కోర్కె బిగిని గుండె తుందుడుకుతో,
బోటి మది కెవండు వేటపశువొ? 207

విరియబూచి మధువు విరజిమ్ము క్రొమ్మావి
తోడ ముచ్చటాడు తుమ్మెద వలె,
జొన్నచేని లోన కన్నె ఇచ్చను దీర్చ
గలుగు రసికు డందు కలడొ? లేడొ? 208

కిసుకు కిసుకు మంచు, నుసురుస్సులు వినంగ
బడియె. మూసియున్న బానసాల!
ఆట తలారి పాత్ర నటియించి రెవరన్న
కత్తిపీట యొకటి, చిత్రమొకటి! 209

***

# స్త్రీ పద్ధతి

కమలనయన! నీవు కలవాడు కలవాడు;
లేదెవండు నీవు లేనివాడు?
కంబుకంఠి! నీవు కలచోటు కలచోటు;
లేవి దేది? నీవు లేనిచోటు! 210

ఆమె కీత డైన నీమెకు నాతడే!
ఇతని కీమె యైన నతని కీమె!
ఆమె ఈమె కాక అత డీత డౌదురా?
లేని వాడెవండు? కాని దెవతె? 211

పడతి ఉన్న యెడల బాధలు పడలేడు;
పడతి లేక నరుడు బ్రదుక లేడు;
పురుష జీవితమును నరకమో స్వర్గమో,
చేయగలది స్త్రీయె! స్త్రీయె! స్త్రీయె! 212

స్త్రీ యనంగ నెవరు? చెకుముకి రవ్వయా?
నూతినీర? గట్టి చేతికజ్జ?
మల్లెపూవ? పిదుపు మామిడిపండ? ఉ
య్యాల ఊప! తోటమాలి కాప? 213

చుఱికి చుఱికి యెడద మెఱుముచున్నవి నాతి
కనులటంచు చల్లదనము కొఱకు
చొప్పకుప్ప లిడకు, నిప్పంటుకొను సుమా!
కుఱ్ఱతనము లోని యెఱ్ఱతేలు! 214

గూళ్లు విఱుగదన్ను, కుండాయి పోట్లతో,
కల్లు త్రాగి ఇల్లు గుల్లసేయు,
పడతి వాని పయినె పడిచచ్చు నేటికో
దాని మర్మ మెల్ల దైవ మెఱుగు. 215

అడుగు దమ్మి పైన పడినాడు; దండమ్ము
పెట్టినాడు; పట్టు పట్టినాడు;
ఆసనాలు వేసి ఆసీను డైనాడు;
కరగ కున్నె? ఱాయి కాదు రమణి! 216

కోటి నిధుల పెట్టు కూటమి రుచి గట్టు
నోటి పట్టె దాని గీటుఱాయి;
అనుభవజ్ఞ యోగ్య. మాపాత మధురంబు,
తరుణి అనఘశాహి ద్రాక్షపండు. 217

కనులు మూసికొంచు, కరగిపోయితి నంచు,
కసిడి కోత నిడిరి కన్నవారు;
మొట్ట నిడగ నీదు మ్రోల జేరగ, స్వామి!
ఇత్తి వీపు కూడ ఱాతిబొమ్మ. 218

"అడ్డమాక లేని అడ్డగాడిద మగ
వాడు, వాని చేర గూడ దెపుడు;"
"ఐన నలరుబోణి! అతని డాసెద వేల?"
"కంచరమ్మ కాదు గార్దభమ్ము!" 219

మెరకవీధి లోని మెట్టలు గుట్టలు,
అమ్మగారి కెల్ల నవగతంబె;
ఇంత చీకటయ్యె. నింకెంత వఱకని
వెదుకగలరు; బాబు! పదియు దాటె. 220

మనసు దోచుకొన్న మనిషికై తెగువతో
వీధు లెల్ల తిరిగె, వెలదిమిన్న;
నిక్కి చూచి నవ్వె నెలవంక కనుబొమ్మ
దిక్కు లెల్ల మింట వెక్కిరించె. 221

ఏడ్వ లేక నవ్వ ఎలపాప నవ్వులో
తొంగిచూచు నేడ్పు పొంగు వోలె,
వెలదిమిన్న మాఱు పెళ్లిపానుపు మీద,
పెగలసాగె మొదటి మగనిముద్దు. 222

నీటి లోన పడిన నీడ యామె; మగండు
నీరె; పైనివాడు పైరగాలి;
తానమాడినట్టి తడి యొత్తుకొన నేల?
పైరగాలి కిట్టె ఆరిపోవు. 223

ముదిత కన్నుగొట్టె పదిమంది గలచోట
ఇరువ దేసి చూపు లెదురుకొనియె;
ఉక్కు ములుకులైన మొక్కవోయెనె కాని
గాయపడెనె తాను, కటికగుండె!! 224

ఆర్య! పీట మీద నాసీనుడవు కమ్ము;
సేద తీర్చుకొమ్ము; పేదరాల;
మంచి విసనకఱ్ఱ మా ఇంటిలో లేదు
పైరగాలి కొఱకు పైటకొంగె! 225

“నన్ను చూడ వచ్చినారురా! నెవరైన
నేను కొంపలోన లేని యపుడు?”
“అయ్యగోర్ని కాక, అమ్మగోరిని చూడ
సిత్తగించినారు సేనమంది!” 226

నాతి! నీకు జవ్వన మ్ముండగల చోట్లు
వెదకి వెదకి చూచి విసివినాను;
ఎచట దాచినావొ ఇకనైన చెప్పవే
ప్రొద్దుపోయె, వచ్చె నిద్దురయును. 227

రమణి పెదవి మీద రావణు డున్నాడు;
కలడు గుండెపై బకాసురుండు;
కటికి క్రింద కలడు ఘనజరాసంధుండు;
అంతకంటె మించి అడుగవలదు. 228

పడతిపై మీరబద్ధముల్ పలికి పా
పమును మూటగట్ట వలదు జనులు;
మీకు కావలసిన కోక సాక్ష్యము నిచ్చు
రైక కొలత లందఱకును తెలియు. 229

మాట లిట్టి వనుట మర్యాద గలవారి
కనుచితమ్ము; పతియె కనుచు, వినుచు,
అనుసరించు నన్ను అతని పచ్చ బొడుపు
బొమ్మ కాంచు డిదిగో బొమ్మ మీద! 230

మోసగాడ వీవు; దోస మెఱిగి కూడ,
కాలిపోతి నీ నరాల మంట;
బూడి దైన వావి వేడి యారక ముందె,
పెదవి మలిచి ముద్దు పెట్టుకొనర! 231

కటిక మొద్దు నైన కరగింప గలదింతి
చతురతయును చేవ సరసమున్న;
రోవెలంది చూడ రోకలిబండైన
చిపురు తొడిగి పొందు చేతనమ్ము. 232

కన్న యట్టులుండె; విన్నట్టులే యుండె;
రాత్రి రెల్ల నాటి ప్రాతకథలు;
వనిత పదుల జూపి, ననుమాత్రమే భర్త
కంట బడగ దీని గడుసుదనము. 233

## పురుష పద్ధతి

పురుషు డెట్టు లగునో! పురుషపదార్థుండు
స్త్రీని గౌరవింప లేని వాడు;
జరుగ వచ్చు సృష్టి పురుషుండు లేకున్న,
స్త్రీయె లేని యెడల సృష్టి లేదు! 246

ఎవరి కీమె యంచు నీశుండు ప్రశ్నించె,
నాకె యంచు బుద్ధి లేక నరుడు
వృష మయ్యెఁ; నారురుక్షు వాతడె యయ్యెఁ;
ఆ ముహూర్త మెంత కామరుహమొ! 247

నేల, నీరు గాలి, నింగి, నిప్పుల నిచ్చె;
ఇచ్చె వెలుగు ప్రకృతి, యొండెఱుగదు;
పుచ్చు కొనుటె తప్ప పురుషు డొండెఱుగడు;
దేవ మానవుల; కిదే విభక్తి! 248

దేహబలము చేత, తీవ్ర చర్యల చేత,
స్త్రీల నెల్ల గెలువ జాలుదు మని
గరువ మొంద దగదు; పురుషులార వినుండు!
మగువలకును దిక్కు మరుడు కలడు! 249

దీప మొకటి నెన్ని దీపాలు వెలిగినా,
మొదటి దీపమునకు కొదువ కలదె?
ఈ యనంత మహిమ ఎటులబ్బె ప్రమిదకు,
వత్తికేని, దాని ప్రత్తికేని? 250

పఱద వాడిచి నట్టి వయసు మనసు మీద
నావ నడప వచ్చినావు రాజ!
తెడ్డు వేయలేవు; తివలేవు చుక్కాని,
చాప నైన పట్టి చాపలేవు! 251

చెల్లె లొకతె దక్క పిల్లలు, తాళపుం
జెవులు, దొడ్డి లోని చెట్లుకూడ,
గుత్తికొండ వారి కొంపలో మగవారె,
కూర లోటు లేదు వారియింట! 252

పలుకు గొంతు నీదు పతిదేవునిదె చూడు'
తలుపు గ్రుద్దుచుండె దబ దబ దబ
అపుడె వచ్చినాడె? ఆఫీసు నుండి ఈ
హాసకమ్ము లోని ఈనెపుదక! 253

'కండ లున్న సరియె? దండిగా మీసాలు
పెంచుకొన్న సరియె? ఎంచి చూత
యువకు లింద అందు ఎవరి దీటగు నంచు
పురుష డితడు కట్టె పుస్తె తనకు' 254

జుట్టు క్రాపుజుట్టు, కట్టు కౌబాయి జీ
న్సట్టహాస మెల్ల దిట్ట మగని
యట్టు కానిపింప యత్నించునే కాని
అతడు స్త్రీయె! సంశయమ్ము లేదు! 255

కటిక గుండెదాన' ఎటువంటి చక్కని
తలపు కాలబెట్టి నలిపినావు'
కాలి కెంత నొప్పి కలిగెనో! కననిమ్ము
పేద పెదవు లొత్తి యూదివైతు! 256

లలన' ఏటికీ యలంకార శృంగార
చారుతర విలాస శస్త్రధార?
అనవసర మ్మిదెల్ల అత డొక్క చూపుకే
పక్కుమనుసు; వేయి ముక్క లగును. 25

ఒక్క సిబ్బి నతివ, ఒకసిబ్బిలో నన్నె
పంచి తూచి చూడుమో ముకుంద!
ముల్లు ఎవరి వైపు మొగ్గునో! పొరుగింటి
వాని వైపొ? ఇంటి వాని వైపొ? ౨౫౮

నిత్య మౌనమూన నీవు నింగివి కావు;
కడలి వైన కావు దడదడ మనఁ;
నీదు గుండెభాష నే నెఱుఁగుదు; నీదు
మౌనభాష గుట్టు కౌ నెఱుఁగు; ౨౫౯

గోడ ఆవలి వైపు కూని రాగమ్ములు;
సైకిలయ్య చేయు కాకలములు;
గది పరున్న వనిత యెద కట్టుకడ కట్టి
అతని గుండె నిద్ర కనుభవములు. 260

నాకు తెలియు నీదు వాలుకతో నాదు
బుగ్గ మీద వ్రాయు పూచికత్తు;
కానరాని వ్రాత లైన కన్గొనుటలో
పట్టభద్రుఁ డోయి! భర్తగారు. 261

మనసు పడిన దాని మక్కువ తీర్చక
మనసు లేని దాని మమత కొఱకు
కాలి, ప్రేలి, తుది దివాలాగ నైనాఁడు,
మాంసవిపణి లోని బేరగాఁడు. 262

మగని పెదవిగానే మది నెంచుకొని చెలీ!
పెదవి నదుముకొందు, పదియెపని,
నీ యవస్థ లోని నిజ మెఱింగియు నేను
కాంచవలనె తృప్తి కవిత వ్రాసి. 263

***

# విరహ పద్ధతి

కలల పైన తీయ తలపులు పారాడె;
గాలి పిల్ల ఉలల నోలలాడె;
ప్రియుడ! నా అదృష్ట రేఖ మూర్చిలె నీదు
మఱపు మబ్బులోన మెఱుపువోలె. 264

కంటి కెంపు వెనుక కన్నీటి చుక్కలు,
పంటి బిగువు వెనుక కుంటు నాల్క,
పగులనున్న రైక ప్రకటించు నెలనాగ
జంటతనము లోని యొంటితనము. 265

సలసలమని తెర్లు కలికి స్నేహము మీద
చిలుకరించినాడు జలము లతడు;
చిటపటమనకున్నె చెలియ గుండె బిగింపు
సొదలు రేపకున్నె పెదవి యగ్గి? 266

అంద మందె కునుకు నత్తిదీప్త విషరేఖ,
వలపు నందె తెలియు వంత లోతు;
నాతి హృదయ మందె నరకంబు నాకంబు;
ఎఱుక లేని వాని కేడ్పె ఫలము. 267

ఘోరు మంచు పొగసె దూరాన పొగబండి,
కంట నీరు వెట్టె కలికి వలపు;
బండిగుండె అగ్నిగుండ మార్ప తరంబె
కడివె డయ్యెనేని కంటినీరు! 268

పూవుతేకు నావ కావించుకొంచు వా
హ్యాళి వచ్చె వలపు గాలిలోన,
చెలియ! నీదు చిలిపి చిలిపి నవ్వేదలోని
గాయ మింక మాన నీయ వాక్కా! 269

అశుభము శుభము నెఱుగనట్టి నా యుల్లమ్ము
గాయపఱచినావు మాయ చేసి,
అందడంగియున్న అసువ్వుల నీకంటి
కత్తి కొసను బట్టి ఎత్తికొనుము. 270

నీదు మాట లెల్ల నీరవ జలధిపై
తెడ్లు వేసి కొనుచు తేలివచ్చె,
నిదురవోవుచున్న నీలోని నను లేపె,
లేచి ఏమి చేయు లేనికన్ను? 271

ఒత్తి యొత్తరాని మెత్తందన మదెల్ల
మత్తు గొలుపుచుండె రిత్త్రవేళ్ళ;
అంటీ అంటుకోక అఱచేత కుంకుడు
గింజ యొకటి వెట్టె గిలిగిలిగిలి. 272

చుక్క యనుము నన్ను; సూర్యుం డనుము నన్ను;
దీప మనుము, మెఱపు తీగె యనుము;
వేకు వనుము నన్ను; నా కొక్కటే తెల్వి
ఆస వెలుగు పాఱబోసికొనుట. 273

ఇంద్రధనువు మెట్ల నెక్కి నా సిగలోని
విరుల చెండు విసరి వేసినాను;
కొండ వోలె పండుకొని యుంటి వీ, వట్టె
కలల మబ్బు లెల్ల కరగి పోయె. 274

విచ్చు విరి గులాబి మత్తు మందిచ్చి, శ
రీరమధువయఃపరిమళమ్ము
పూరగించి, ఇట్లు సారాయి కైపు నె
క్కించి ఎచటి కేగె దించుబోడి? 275

ప్రకృతి చిత్ర మైన గ్రంథరాజము నందు
శోధపడని యట్టి పుటలు రెండు;
చావు మర్మ మొకడు; చాన మర్మ మొకడు;
కేసవసి రెంటికిని జగాన. 276

వాడి వాలు కనులు; చాలివచ్చిన శ్వాస,
అదరు పెదవి, వగము విడిన నోరు,
పైరగాలి జుట్టు, పారాడు పయ్యెద,
నెంత దాక కని సహింతు చెలియ! 277

కప్పు తెప్ప లోన కపటకోపమ్మును,
విప్పు తెప్ప లోన వెఱ్ఱివలపు,
నాకు చావు బ్రదుకు గాకుండ చేసితి
వేమి చేయ మనెదవే మృగాక్షి! 278

తనివి దీర బోని పెనగొన్న కౌగిలి;
వద్దు గానకున్న పెద్దముద్దు;
మత్తు వదలనీని మధుశాల రాజ్యంబు;
నిన్ను తలచుకొంట వన్నెలాడి! 279

మొగ్గ విడిచి చిన్ని సిగ్గు దొంతర లోన
నవ్వుచున్న లేతపువ్వ! నీదు
వంపు తెక్కులందు వింపెల్ల నాప్రియు
రాలి పెదవిపై విరాళియె కద! 280

కునుకు నెఱుగనట్టి కనులలో దీపంబు
వెలుగజేసి సఖుడ! వెదకిచూడు!
మీ వియోగహృదయదేవమందిర మందు
నిలిచి యుందు రెవరు? నీవు గాక. 281

మండుచున్న వత్తి మండకున్నను మండి
పోవు జిడి నిజమ్ము, పురుగు బ్రదుకు,
హా! నీదు కనుల లోని మోహజ్వాలం
పెదవి ముట్టి రాజె హృదయమందు. ౨౮౨

కన్ను మూసికొన్న, కనరాదు ముందున్న
జగతి; ఎటనో నున్న సకియ తప్ప,
ఏడ్చియైన నామెనే కోరుకన్నులు
మతికి చెప్ప గలమె? మారు మాట? ౨౮౩

కనులు విప్పి చూడ గదే; నన్ను కామినీ!
కఱవుతోడ కడుపు కాలుటయ్యె;
సుందరాంగి! నీదు సొమ్మేమి, పోవునే?
పెదవి నొక్కసారి కదిపినంత. 284

విషములోన ముంచి వేసిన నీ చూపు
దూపు లేల వృథగ తొలగిపోవు?
గురు వెవండె? నీకు తరుణి? ఈ విలువిద్య
కఱచినావా? పుట్టుకకును ముందె? 285

ఎగుర వేసినాను, ముగుద! నిన్ వినువీధి
కందె నిలిచి తేల? క్రిందపడక;
క్రింద పడుక! పడుక క్రింద నా పడుకయ్యె
మఱల జన్మ మెత్తువఱకు సెలవు; 286

అడిగి తెచ్చికొంటి వౌర! నా చెలి బుగ్గ
లాలిమమ్ము! నో గులాబి పూవ!
లేకయున్న, నింత సోకెక్కడిది; లేత
ఆకు క్రింద కూడ నీకు ముల్లె! 287

వ్యంగ్యభాష లోన వ్రాయుచుందురు కవీ
శ్వరులు నిన్ను గూర్చి మరులు తీప!
అతివ నంటుకొనక అర్థమెవ్వరి కయ్యె?
నీవు పూచు పూల తావుల బిగి? ౨౮౮

నది యొసర్చు విరహనాదంబు లోపల
కడలి ఘోష కూడ కలదు డాగి;
తనదు గానమునకు తగులు నెచ్చట నడ్డు
లటనె యంబుధిత్వ మందు తటిని! ౨౮౯

చూచినట్టివాని చూపెట్టిదో కాని
చుఱికి బుగ్గ మీద చుక్క పడియె;
చుక్క కూడ సుదతి కొక్కచో నిలువక
తగని చోట్ల నాడె తాండవమ్ము. ౨౯౦

బుగ్గ మీద నలుము సిగ్గు కుంకుమ కంటె,
పెదవు లందు కురిసె బెదరు జల్లు;
దాని కంటె ముందు తడబాటు హెచ్చయ్యె;
పడతి యెదుట నగ్ని పర్వతంబు! 2౯1

ననగులాబి తోడ నును బుగ్గలను మోవి
కొనల నట్లు రాచు కొనెదవేల?
పూవు స్పర్శవోలె స్ఫురియించుచున్నదో!
మఱపు రాని దేదొ మధురసుఖము? ౨౯౨

ముప్పదేండ్లు నాకు; మూడేండ్లు దానికి;
పచ్చి ప్రత్తికాయ, పడతి మనసు;
ఎపుడు పండు? దారమెప్పుడు తీయుదు?
ఎపుడు చీర మగ్గ మెక్కజేతు? 2౯3

***

# వయసు పద్ధతి

పసుపువాడ! నిన్ను గడచి పోనీయను;
నాగరికసమాజనైతికోగ్ర
ధర్మబద్ధజీవితాగ్నికుండమ్మిది—
స్నానమాడు వఱకు దీని లోన! 294

అమ్మగారి యాట లాడింపగా బోయి
అమ్మగారి యాట కయ్యె నతని
పడుచుదనము లోని పస నేల వర్ణింప
అంబు తానె లక్ష్య మయ్యె నహహ. 295

తనువు పూర్త మాతనినె కోరి పైదూకు;
మనసు వద్ద టంచు వెనుకకాడు;
ఇంతి కోటగోడ లెందాక నిలుచునో.
చూడ మారు వొక్క చోట నిలిచె. 296

సగమె యొప్పుకొంచు, సగములో బిగియుచు
బెట్టుసరిని చేసి ముట్టుకొనుచు.
కినుక బూని సన్నై చనవిచ్చి పైకొంచు,
ఆరజేయు రమణి అమృతఫలము. 297

గరిటకాడ, తెలిసక అబద్ధగా బలా
మాయి తెసి మిమ్ము పాలివైచె;
కచ్చ బిగియగట్టి వచ్చిన పోతెగా
గద్దరమ్మ నోరు కట్టినాడు. 293

హిందుమతమొ, వాని దిస్లాము మతమొకో,
క్రైస్తవులదొ; మఱి జొరాస్త్రులదొ?
అంచు వాదములను పెంచుకో నేటికి?
మతము మరుని దాడు మగమతమ్ము. 299

ఎంత చేసికొందువే, ఇంతి! శృంగార?
మింత పులుముకొనుట లెందుకొఱకు?
పడుచుదనమె యున్న పనిలేదు పీనికి
పడుచుదనము లేక పనియెలేదు 300

రసికవరుని కరమ! రమణీయమగు పూల
చెండ్లొ; తమ్మి తీప తూండ్లొ! విండ్లొ!
చిగురుటాకు దొన్నె! మగజాల తిన్నెలో,
ఏది 'ప్రియమొ' కన్ని స్పృశింపుమిచట. 301

స్త్రీల కుండునట్టి శృంగార రసవాపి
దివము నుండి భువికి దిగుచునుండు;
పురుషు లందు పొడము సరస స్రవంతిని
భువిని లేచి పొంగి దివికి పోవు. 302

వనిత కంటి తెప్పవంపు; కెంబెదవిపై
వంపు; ముక్కు చివరి వంపు; బుగ్గ
వంపు; గుండె వంపు; వళి వంపు; మెడ వంపు;
మరుని వింటి వంపు; మరులు వంపు; 303

కొన్ని ముద్దు లేరి, అన్నుమిన్నల కెంబె
దవుల చేయజూచె తమ్మిచూలి;
జగడమునకు వచ్చె మగువల మేని కం
దమ్ము గూర్చు నవయవమ్ము లెల్ల! 304

కొండగోగు పూవు కొసవోలె మూతి బి
గించి, ముద్దబంతి యంచులట్లె
చెఱను విడిచి, ప్రొద్దు దిరుగుడు పూవుగా
చెంగలించె నిపుడు చెలువ మోవి. 305

***

# రతి పద్ధతి

కోపరసము తోడ క్రుళ్ళిపోయిన నేమి?
తెలియవగు నిజంబు పొలతు లెల్ల!
వలపురాజ్య మేల పైవాడు మగవాడె
మంచమూన దెపుడు 'క్రిందిమెట్టె' 306

సగము రాత్రి దాక సగమె జవ్వన మామె
కిపలు వయసు పొంగు లా పిదపనె!
అర్థరాత్రి దాక అర్భకుం డాతండు
పిదప వట్టి మొద్దు నిదురబోతు. 307

గడప మీద నిలిచి కారాలు మిరియాలు
నూరుచున్న దత్తగారు, మీరా!
కొసరుచుండి రింక కొంచె మింకను కొంచె
మనుచు నేను దాచుకొనిన యట్లు. 308

శ్రద్ధ మంగలి తన ఒడుపు లెల్లను జూపి
పడతి యొదలు రాత్రి పట్టినాడు,
కదల లేదు; భామ క్లాసుకు పోలేదు;
చెల్లి! వ్రాయవమ్మ! సెలవు చీటి. 309

ఓడుక లేవలేక నీరసించెను; చాన,
మోటువా డటంచు మొట్టి వెట్టె;
చీకటి పడు సరికె, సింగార మై పోయి
మిగల సిద్ధ మయ్యె, మరుని పధకు. 310

వామనావతారవైఖరిలో శివ
లింగ లీల జరిపె, దొంగ వెధవ!
మగువ నొసట నింత మన్మథభస్మంబు
పూయ రమ్మ! బలులు పుట్టకుండ. 311

దిండు చేసికొన్న ముండ కర్మ మదేమి?
పడుక చేసికొన్న పాప మేమి?
అడ్డమైన వారి కడుగున బడి మోయు
దిస్స మొలల నుస్సు డుస్సు రనుచు. ౩12

ముద్దులాట కేమి హద్దులా? పద్దులా?
కౌగిలింత యొకటె దాగుమూత!
కనులు వెల్లకిలినగా, కాంత కగపడు
దూల మెక్కి యున్న దొంగ మగడు! ౩13

బోటి తొడల ననటి బోదెలతో పోల్చి
వ్రాయుచుంద్రు కవులు వర్ణనముల;
నందు దూట పట్టునవె యాడు చెట్లని,
మగ వటంద్రు బుధులు మిగిలినయవి. ౩14

కొఱికికొని రాకొట్లాకొట్ల ముక్కులు రెండు
నొక్కమారె యన్న నొప్పదగును;
కొఱికికొని రాకొట్లాకొట్ల బుగ్గలు రెండు
నొక్క మారె యన్న నొప్పు బెట్టు? ౩15

కనులు మూసి కొంత, కనులు మూయక కొంత,
పెదవి విడిచి కొంత, విడక కొంత,
మారుకొనుచు కొంత, మారుకొనక కొంత,
కోరి కొంత, కోరికొనక కొంత! ౩16

తరుణి నీది కాదు తప్పు నా కనులది,
చిలిపి పనుల కైన కలదు హద్దు!
నిక్కి గుండె మిట్ట లెక్క మన్న దెవండు?
నలగ మన్న దెవడు? నడుమ దూఱి; ౩36

"దాని కన్నులందు ప్రణయవహ్నిజ్వాల
నాల్గు లెవరు చూచినారు రాత్రి?"
"ఆమె నీమె నడిగి యేమి ప్రయోజన
మసలు వాని నన్నె అడుగరాదొ!" 318

పరమ నాస్తికుడను; బ్రహ్మచారిని నేను
కళలు నాకు రావు; కవిని గాను;
గాలి ఈత వీడి, కలవరింతలు మాని,
మేలుకొనుము; నేల మీది కతివ! 319

వంజుకొనుటె యయ్యొ నడిరేయి దాక, నీ
భోజన మ్మికెప్డు రాజరాజ?
నాకరాజ్య మందె ఏకాదశింతునా?
ద్వాదశింతునా? ధ్రువమ్ము చెపుమ. 320

వెన్నపూస కంటె, సున్నని, ప్రన్నని,
చిగురుటాకు కంటె చెఱువు నొసగు
జుంటి పెదవి మీద సొమ్మసిల్లె మనస్సు,
కదల లేను; చెలియ! వదల లేను. 321

సానిదోమ గొంతు కూవి రాగము లాగ,
తాళతంత్రి వేయు మేళము వలె,
పావురాయి పిల్ల ప్రతివల్కు కూతలా,
కలికి గుండె బదులు పలికె నాకు. 322

పడుక వలదు; వలదు పట్టెమంచము, పర్పు,
చాలు నాకు వట్టి చాప యైన
చాప లేకపోయినా, పావ మేమి రా
దతివ! నీ యనుగ్రహమ్మె వలయు. 323

గోరుగంట్లు పొడిచి, కుంకుడు గింజల
గట్టి కొాక పరీక్ష పెట్ట వలదు;
రసికులార! ధాత రసియించు పసివాని
పెదవులందె కోత లదుక గలవు. 324

ఒంటరించు వారి జంటించుటె జగాన
సృష్టి లోన గల విచిత్రశక్తి;
పెగ్గె లెల్ల కట్టి వేసి, చెప్పవె! ఏది
మప్పు నీకు? కారమా? మిఠాయి? 325

మూడు కాళు లున్న మోడీ విడని పీట;
నాల్గు కాళు లున్న నలుగుపీట;
కంతు మెడను తఱుగు కత్తిపీటలు రెండు
మగని కొకటి; అతని మగువ కొకటి; 326

రాణి వీవు కావు; రాజును నే కాను;
కలల నేల కనగ జలజనేత్ర?
జరిగిపోవనిమ్మ, సామాన్య సంసార
పద్ధతినె; నిశార్థభాగమయ్యె. 327

బొడ్డు దిగక మునుపె, మొలనూలు నీకున్న
నడుము పేచటికము నాకు తెల్పె;
కనులు తెఱచి కూడ, కనజాల కున్నాను;
భయ మికేల? రమ్మ! పంకజాక్షి! 328

నోరు కలుగు వాని నేరేడు పండ్లకు,
మంచి కండగల ఇమాంపసందు;
పచ్చ యమృతపాణి పనసపండే జోడు,
దాని నడుమ నున్న తేనె తొనయు; 329

కఱవు కాటకములు కలవు నూనెకు, బియ్య
మునకు, మఱియు, తిండి దినుసులకును;
మదని విపణి లోని మరులు సామగ్రికి,
కఱవు లేదు; కాటకమును లేదు; 330

క్షణములో నతండు జావ జావగ నయ్యె
మగువ మగతనమ్మె మగతనమ్ము;
చెప్పుకోను, నోరు విప్పికోగను రాని
చలిమి డయ్యె తనదు చవట బ్రదుకు. 331

అందమైన కళ్ల కాతండు పదిముద్దు
లనియె;- చెఱగు మాసె నంటి;- కొయ్య
వాఱె నతడు; పైనబడి మోవి నొక్కితి,
పవలు పందలయ్యె- పిదప వేలు!!! 332

పూలతేకు లెత్తు గాలి నెత్తురు పీల్చె;
నల్లి జూళ్ళు కూడ నలిగి పోయె;
రాజ! తనివి రాదురా! పెనంగెద వింక,
ఎన్నిసారు లింక, ఎన్నిసార్లు? 333

ఐదు రోజులైన లేదు పరీక్ష; నా
తొమ్మి మీద పుస్తకమ్ము నుంచి,
మదనపాఠములను చదువు చుంటిరి మీరు
లెండి! బాబు! చదువుకోండి! కోర్సు. 334

పడతి యొంటి మీద బానిస తొత్తును,
చీర యనుచు నాకు పేరు కలదు,
మగడు వచ్చినపుడు మాత్రము, నన్నిమె
బానిసీని కంటె హీనపఱచు! 335

*—*

# స్త్రీ సౌందర్య పద్ధతి

కలికి మాట లెల్ల కలకండ పలుకులు,
చూపు లౌర! వాడి తూపు గములు;
ఆస్యమందు జిల్కు హాసచంద్రికలు; వ
లక్ష మొకటె మిగుల రాక్షసంబు. ౩౩౬

చిటికె కేటి బుద్ధి? చిటుకుమన్న క్షణంబె
గాలి కడుపు లోన కలిసిపోయె
వ్రేళ్ళ కంటుకొనెనె? వేసిన వానికి?
సిగ్గు లేదె? వెలది బుగ్గకైన? 337

కన్ను కొట్టికొట్టి, తన్నె చూచిన దంచు
చెలియ గుండెమీద చేయి వేసి,
మంత్రి యంతవాడు మటుమాయ మైనాడు
చిల్లి వాడువు డీమె మెల్లకన్ను. 338

మఱచిపోయి కూడ, మానిని బాహు వ
ల్లికల దఱియు దాపులకును బోకు
డయ్యలార! నాదు ననుభవమ్ము వినుండు!
పూల గుండె లైన ప్రేలిపోవు. 339

కుండ లందు క్రింది కొండ లందును నీకు
ఉండి ఏమి ఫలము? మెండుతనము?
కటికి పట్టి యున్న కఱవెల్ల కడుపుల
మాడ్చి చంపుచుండ మమ్ము చెలువ! 340

బొలబొలబొల నేడ్చె మెలికలై పెదవులు,
కలకలకల వచ్చె కంటినీళ్ళు;
కలికి దీపకళిక చలితోడ వడకగా
సాగె- విగురువెట్టె తీగ మేను. 341

తన్వి! నీకు చక్కదనమును గూర్చిన
తనువు లోని బ్రహ్మపని యదెంత?
మట్టి యెంత? నింగి పట్టెంత? నిట్టూర్పు
గాలి జాలి యెంత? కాంతి ఎంత? 342

పడతి నీకు నొసల బంగార మున్నది,
ముత్తియములు కలవు మోవి వెనుక!
నీదు కనుల గలవు నీలాలు, నీ పేద
ఱికపు చోట్లై నాకు ఓకిర మిమ్ము. 343

త్రాగబోదు తటిని తననీరమును తానె,
తనను తగుల బెట్టుకొనదు వహ్ని;
తరువు తనఫలమ్ము తానె భుజింపదు,
ఆత్మబలికి హేతు వంద మొకటె! 344

అతని ప్రేమ కంటె ఆమె అందమె హెచ్చు
నోటి తీపి హెచ్చు కోటిరెట్లు;
ఆతని యెదద లోన నా రెండునుం దీప
కళిక లట్లై సతము వెలుగు చుండు. 345

చిట్టి పెదవి మీద చిటికెనవ్రేల్; లఅ
చేతి గిన్నె లోన చిబుకపుటిక;
గట్టుపైన కాలు; కాలిపై మో చేయి;
నడుము వంపు; వారె' పడతి సొంపు; 346

తలను జాఱునట్టి జలపాతముల కంటె
జడకు చివరి కొసలు నడుము మీద
నూగులాడు నప్పు డువిదకు పండ్రెండు
రకములైన పసలు ప్రకటిత మగు. 347

*.*

## ముసలి పద్ధతి

గడిచె నాల్గు నెలలు కలికి పెదవి మీద
గంటొకండు కూడ కాన బడదు;
తాత గారి నోరు తాబేటి నోరయా!
పరుల నోరు సతికి పనికిరాదు. 348

ముసలివా డనుకొని నిసి వాన తలదాచు
కొనగ దూఱి అతని కొంప లోన;
వయసు వావి జేసి వచ్చినావు; పురంధ్రి
పొలసు రుచినిగన్న పులి యతండు. 349

బిడ్డ లంద ఱిపుడు పెద్ద వారైరని
ఇంతి వంక బెట్టు బెల్లి వినియు,
ముసలి యెద్దు మీద కసి జూపె దేలరా!
కొంకులేక కుఱ్ఱకుంక మరుడ! 350

కలియదగిన చేదు కాకరకాయది;
కలియబడదు ముషిణి కాయ చేదు;
రంగిగా డదెంత ఆక్కినా, త్రొక్కినా,
కట్టు పళ్ళ మగని కంటె మెఱుగె. 351

వయసుప్రాయ మందు వార్ధక మ్మైనచో
వెఱ్ఱితీపి లోన వెగటు బుట్టు;
వార్ధకంబు నందు వయసు ప్రాయంబైన
వెగటు లోన బుట్టు వెఱ్ఱితీపి. 352

వచ్చి ముసలి వయ్యె వచ్చిన గడియలు;
రాక ముసలి దయ్యె రాని గడియ!
ముసలితన మొకండె సిసలైన కాలంబు,
భ్రమయె కావి లేదు పడుచు గడియ! 353

•*•

# సంప్రదాయ పద్ధతి

చిట్టిచాప కొనను పట్టుకొని వధూటి
చావ చూచి కూడ జాలిపడదు;
సొంత పెండ్లికొడుకు సొలాని కూతురు
కట్టు త్రాడు పరుసు కత్తిరించె. ౩౫4

ఒరు మొగమ్ము వాని అరువేత్ప విను భార్య
పకపకలకు గోడ పగిలె సన్న;
అఱు ముగము వచ్చె నయ్యొ లోకాకాని
కెగిరి పోవు వాడ యిండ్లు నేడు. ౩౫౫

పురుషులకును గూడ మోహన రూపుండు,
నామ మందు కూడ రామమూర్తి
కావలసిన వారు కస్పాబజారు వి
లాసమునకు కమ్ము వ్రాసికొనుడు. 356

వీపె తడవినాడు వేపారి పంతులు,
పడుచు భార్య రైక ముడిని విప్పి,
ఇంతి ఎడద కనుట కెన్నాళ్ళు పట్టునో
ఎన్ని జన్మ లాత డెత్తవలెనో? 3౫7

చేతబడిని చేసి పాత్రికి టెంకాయ,
గోడ క్రింద నెవరొ గోయితీసి,
తెచ్చినానె త్రవ్వి పచ్చడి సేయవే,
ఒకప దయ్యమైన జీర్ణమగును. 358

చెట్టు మీద నున్న చింపి దయ్యము కూడ
చవిని చూడ దిట్టి చప్పిడులను,
ఉన్న మిరపకాయ లన్ని దాని మొగాన
దిష్టి తీసి పోసితివి కదమ్మ! 359

తోడు లేక పడునె? తొడకాళ్ళు వీనికి!
పుట్టినాడు చూడు బొట్టిగాడు;
పుట్టిపాప నీళ్ళు ముంతెడు పోయుమా
ఎండు నరమె యగును గుండుజాయి. 360

పండు మీటి బిడ్డ దెండియాడిన బొడ్డు
పరుల కనులు మీద బడని దిడిగొ;
బెల్లమందు మాటు బెట్టి మ్రింగు మికెన్ని
నాళ్లు; బిల్లలంచు కుళ్ళ గలవు? 361

ఉగ్రషష్టు లెన్ని? ఉద్యాపనములెన్ని?
రక్షరేకలును ప్రదక్షిణములు?
ఎన్ని పాట్లు పడిన నేమి కర్మమె కాని
కోడలమ్మ కడుపుతోడుకొనదు. 362

తీర్థ మందు కీడు దీయించగా నన్న,
నాయనమ్మ కొంచు బోయినపుడు;
క్రుళ్ళు బాపనయ్య కొల్లాయి ముదిగబ్బు
మారుజన్మ కైన మఱపురాదు. 363

ఆఱునెలల గర్భ మట్టె మాయ మయ్యె
ఒక్క చిటిక లోన నక్కజముగ,
వనిత పోయె నంట జనుప చేనికి, రాత్రి
కోడి కూయువేళ కొంపజేరె. 364

నాన్న నాకు తెచ్చినాడు మామిడిపండు,
పుల్ల దొడ్డు నాల్క చిల్లి వడియె;
అటుక నుండి తీసి నెటికెడు పెట్టవే!
తాతపెట్టెలోన తాటి తాండ్ర. 365

***

## వ్యాఘ్ర పద్ధతి

కష్టమనెడి పేరు; కజ్జాలు కోరలు;
కాంచనాలు గోళ్ళులకలు; కన్ను;
వాడి మొనవు వంటి వఘవు ప్రాణానికి
పెద్దపులియె నేడి పెండ్లికొడుకు. ౩౬౬

నల్లచీమ లెల్ల తెల్లని కుండల
తలల నెత్తికొనుచు తరలిపోయె;
పేరటమ్ము కొఱకొ పెండ్లి కోసమొ; యేరొ
చావుమందు మీద చల్లినారు. ౩౬౭

పెద్దపులిగ నీవు వేషమ్ము గాంచి, మ
స్తానురాజ' మగడు తలుపు మూసె;
గడియ ఓయ డింక, గదికి గొళ్ళెము వెట్టి,
గుబ్బగుబ్బ మనుము గుబ్బ మెక్క. 368

చింకి చెప్పదండ, బంక అడుసు గంధ
మలది అరటిపిలక ఆకు లెల్ల
నమలి వైచి తింక తమలపాకుల వోలె
కొట్టి కుందు నెట్లు పట్టమహిషి. 369

పగలు నీడ వోలె పడియుండి, ఇరులలో
నిడ తానె లేచి నిలిచియున్న
దొంక పిశాచి గీత, ఉప్పరమను మట్టి
ఊడ, కాదు కాదు; తాడిచెట్టు' 370

చట్టు మనసు కూడ బొట్టు బొట్టయి కాఱ,
కాలు నెత్తు పాడె జోలపాట,
ఆకసమ్ము సైత మట్టె బ్రమాన్పడిపోయె,
ప్రళయభస్మ మందె ప్రణయరశ్మి. 371

నిప్పుమంట వెల్లి నింగికే పయనించు;
పిడుగుధార దిగుచు పుడమి వైపకు;
అన్నిచోట్ల నిండి యున్న చైతన్యాన,
విలయశక్తి యొకటి నిలయమొకటి. 372

పిల్లి పెండ్లికొడుకు పెండ్లికూతురు గూడి
కామదేవు కొంప కాల్చినారు;
రాత్రి రాత్రి యెల్ల క్రావళ్ళ త్రూవళ్ళ
అరవవాడ ఝంజ దరడ దరడ. 373

తణుకు లోనె పుట్టె; తణుకు లోనె పెరిగె:
దానితల్లి, దాని తల్లి తల్లి,
కోతివోలె మగని గోళ్ళతో పడవీకు,
కొంప కగ్గి విడదు; కొంత నయము. 374

పట్టు దూది వంటి పంది మాంసము నెల్ల
లౌజు వోలె నమలె రాజరాజు;
కడకు మిగిలినట్టి కాళ్ళు, గిట్టల దౌడ
కటకటించె రాజుగారి కుక్క, 375

పిల్లవాడు మాత్ర మల్లొ నేరేడు పండు,
చేడె మాత్ర మాడు పాడెగట్టు;
పండు చప్పరించుచుండు నప్పుడె దాని
ఘాటి గాని, నేడ దేటి మాట? 376

వ్రాసికొనుము పేరు రంగు బొమ్మల పైన,
మహిళ పైన, తాజమహలు పైన,
అణువుబాంబు పైన; అయ్యొ! నీ పస జూప
బోకు మీ గులాబి రేక పయిన. 377

తగని పొగరు కనుం గెగదట్టి యున్నని
నాస్లె త్రాపినావు కాళ్ళ నెత్తు;
కాళ్లె వేల్పు లైరి; రమణి! ఇప్పటి కైన
మనిషి రక్త రుచిని మఱుగ గదవె. 378

కన్నె బందుగోబి కత్తిపీటను జూచి
పులుకు పులుకు మన్న ఫల మదేమి?
నఱకివెటి, పొరల నరము లన్నియు లాగి
మూకు డందు వేచె పాకయాజి. 379

తడిసికట్టి నలిప మొదలి బంగారమ్ము
అమ్మచుండ, వర్తకమ్ము చేసి,
వయసు పంపు లెల్ల బయలించి, యూరించి,
దాచుకొంటి వేల? క్రూరురాల! 380

గ్రుచ్చుకొన్న గాని, గుర్తింప రానిది,
కామవిరహ మందు ప్రేమ ముల్లు;
నన గులాబి వోలె మనసెల్ల రసియించు,
తేలుకొండి వోలె జ్వాల లుమియు. 381

అతివ! నీవ గలుగు నైశ్వర్య మందమే
యశసు పొమ్ము; మగల హత్య కైన
ప్రేరణమ్ము చేయు కారణ మ్మదియైన
గర్వపడుట నీకు కటికితనము. 382

మరులు మండి పోవ మగువ నగ్నను చేసి
అనుభవించినార లైదుగురును;
తనివి తీర కామె తనువు ముక్కలు చేసి
రొచ్చు గుంట లోన గ్రుచ్చినారు. 383

***

# గ్రామ్య పద్ధతి

కూలి నాలి చేసికొను వాని యెడదలో
నందనాల పూలు వందవేలు;
ఛనికు లైనయట్టి జనుల చిత్తము లందు
పాడు గబ్బు తోడ పేడదిబ్బ. 384

బాస చేయుచుంటి, నోసి కలహకంఠి!
గడ్డి గొంతు మీద కత్తివెట్టి
పూల పాన్పు నీకు తేలేక పోయినా
దొడ్డి లోన నంతు గడ్డిపఱుపు. 385

కూటువడ్డ రైక మాటెల్ల గన్పింప
మట్టి గంప నెత్తె మాల పడుచు;
పంచబాణు డనెడు పాముల వాడొక
తొస్సెనోట బుస్సు బుస్సు మనియె. 386

బుసలుకొట్టె గడ్డి కొసలపై కొడవలి-
కస్సు మనియె అయ్యగారి బజ్జ-
ముచ్చిలించె ముద్దుమోవి రేకొకమోవి-
చప్పరించె నెజ్జి చిప్పమీను. 387

అలికినాడు పొలము సపలేరు రాగానె;
మఖ పొగాకు నారుమళ్ళ బోసె;
పోసె నల్ల నువులు పుబ్బలో ఫలమేమి?
తెప్ప వచ్చి చివికి నప్పుడుకద! 388

వానపాము; బెస్తవాడు; గాలము ముల్లు;
చేప నోరు; దఱిని పేపబుట్ట;
ఏరు పుల్ల మంట; కారాల తాలింపు;
లోవి నీటిపూవు; బ్రేవు బ్రేవు; 389

***

# భార్య పద్ధతి

చెంప మీద నేల చెంగావి రంగయ్యె?
మగని కతడు చాల మంచివాడు!
అప్పగారి వైనై అతిసున్నితమ్మయా,
పొక్కులెక్క వెన్నపూస కైన. 390

వనిత యెద గులాబి వన్నె; జాబిలి; వెన్న
వెన్నె లగును, దాని కన్నె వలపు;
పెచ్చరదనము విభుని గ్రుచ్చిన కౌగిలి,
పిత్తె పాడి యావు క్రొత్తభార్య, 391

అతని అక్కచెల్లెలకు ఆహారమై పోయె
భార్యపదము లోని భావ మెల్ల;
ఇంక మిగిలి యున్న దిప్పు డామెకు కాని
భర్తపదము లోని ఆర్తి యొకటె! 392

మాధవుండు వాడె; మధుసూదనుడు వాడె,
శివుడు వాడె; అంగ భవుడు వాడె;
నమ్మవలసి నట్టి నాధుని నమ్మక
భోరు మన్న నెట్లు తీరు సతికి? 393

పూలు చెండు క్రింద పోయుచు లలితాంగి
తనకు తానె నవ్వు కొనెడు నపుడు
వెనుక తెలియకుండ ప్రియుని యూహింగన
మలిపె నపుడె తెలియు నతివ నేర్పు. 394

తమ్మిపూల బోలు నమ్మ! నీ యందమ్ము
నీటి వంటి వాడు నీమగండు;
నీట నుండు నపుడె నెలత జీవన మైన
మునిగియుండ దెపుడు వనజసుమము 395

***

# భర్త పద్ధతి

ఉన్న మువ్వు రందు ఒకతె లజ్జావతి;
ఒకతె తేలుకొండి; ఒకతె మొండి;
ఉండి అట్లతద్దె! ఉండక ఉండ్రాళ్ళ
తద్దె; అయ్యొ ఎద్దు మొద్దు బ్రతుకు 396

బ్రాందిబుడ్డి కొఱకు పడతి నమ్మిన హరి
శ్చంద్రు డతడు; ఆమె చంద్రమతియె;
చనుల గుడుపు శీలమున మొండిమొల అన
సూయ ఆమె; భర్త బాయిగాడు. 397

పగములోన నను రసాభాసమును చేసి,
లేచిపోయె నిట్లు లేమ వెలికి,
దేవదేవ. ఇంక నీవైన కరుణించి,
చేయు మయ్య! దుష్ట శిక్షణమ్ము. 398

ఎండగట్టినావు చండి! ఇన్నాళ్లను
పెండ్లివారి గొడవ పేరుబెట్టి;
అప్పగింత లయ్యె! ఇప్పుడు వధువుతో
పయన మైత్రి వెట్లు బ్రదుక గలనె? 399

కనుల కున్న ఆనకట్టలు తెగిపోయి;
గుండె లోన కుములు కొండపగిలె;
మగని మేను చనెడి మార్గరేఖ అదెల్ల
సుదతి మదిని తోకచుక్క యయ్యె, 400

నెలత వాని పైన నేరమ్ము మోపియు
ప్రజలు వాని చావబాదుచుండ,
క్రుక్కుకొనుచునుండె గ్రుడ్లలో కన్నీళ్ల
ఇంతి యెద తుఫాను నెవ్వడెఱుగు? 401

••••

# ప్రసూతి పద్ధతి

పురుటిసాల నుండి పొలతి వేసెడు కేక
ఆలకించ లేక అట్టు నిట్టు
కొట్టుకొనుచు పుస్త్రు చుట్ట లాచున్నాడు
పతిని కాదొ. కాను పితని కాదొ? 402

కార్తికంబు నందు కాపరానికి వచ్చె,
మాఘ మాస మైన మరల లేదు;
సంతులమ్మగారి భాగ్యంబె భాగ్యంబు,
పండు వంటి కుఱ్ఱవాడు పుట్టె. 403

ఎక్కతింప రాని వగు భూతములకైన
మూర్తు లగుట కెంత యార్తి యొక్కొ!
దుమ్ము లెత్తి గాలి బొమ్మలై నటియించు
మబ్బు లెత్తి నింగి ఉబ్బరించు. 404

నగల బెట్టి నీకు కమలమ్మ, చేతికి
పిల్లదాని నిచ్చి పెళ్లపుడును;
వెఱ్ఱిదాన వీవు; పెదపెద్ద వారికే
పడుట కష్ట మామె పాలు పులుపు 405

అయ్యగారి కేమొ, ఉయ్యాల జంపాల
ముండమోపి కేమొ, కుండమోత;
పాపభార మెల్ల రూపైన పాపాయి
కమ్మ ఎవరు? గుండ్లకమ్మ కాక! 406

ఆస చూచె సతియె అందగాడ వటంచు,
పుట్టె బిడ్డ నీదు పోలికై తోడ;
బ్రహ్మ మాయ చేసె: పడలేదు పతిపోరు,
కంటిచూపె యగునె? చంటి బిడ్డ! 407

* * *

## తిక్క పద్ధతి

అప్రకసల పంచి అంపగర్తెలు లేక
మేం చెప్పురాదు త్రెం సహమ;
తిక్క గంతకందప్పు పత్నెక్క త్రి నోడ
ముద్దు పెట్టుకొనెదమ కష్టమంచు. 408

“ఎక్కడేది! నీవు జుట్టి హాహాయనా?
గడిచి తానె వనువు మొదట మాటె;”
“లేదు రావె నీవు కూడ అక్కా! అది
పెట్టు బాప దీసి గిచ్చు నక్క”. 409

పట్టి కథలు చెప్పి నెట్టినా వీ రాత్రి,
కోడి కూసె, పాలవాడు వచ్చె;
ఇది భరింప జాల; ఇపుడైన తిరుగు మీ
ట్లొక్కసారి– చెలియ;– ఒక్కసారి! 410

మెదడు లేదు కనుక మదరాసు బీచిలో
కలిచినట్టి గడ్డి మఱచి పోయె;
మఱచి పోక యున్న హరహరా! రెండౌనె,
దుడ్డుకఱ్ఱ క్రింది నడ్డిపూవ! 411

తనను కట్టి పైచి తనమ్రోల దయితను
చెఱుచు చెనటి నేమి చేయ లేక–
కడకు కట్లు విప్పగా వచ్చు భార్యను
కులట! నన్ను తాక వల దనె పతి!! 412

జగతి యెల్ల తనదు స్థానమ్ము కోసమే
ఆసపడు నటంచు పీసు నొందు;
రాజుగారి కుక్క! రాజరికము తన
తలనె విలిచి నట్లు తలచుచుండు! 413

•••

## గణిత పద్ధతి

ఆతని కాయ కెట్టి యతనితో నాలుమూ
క్కలిచినాడు; మాట చిక్కినాడు;
మిగిలినట్టి దాని సగము చేయుచు మూడు
భాగవేసి తానె మిగిలినాడు. 414

ఒండు నొండు కలిసి రెండౌట సరిగాదు;
రెండు రెండు గాగ నుండుటయును;
మగువ మగడు నేక మగుటలో మర్మంబు
ఒంటి తీసివేత రెంటినుండి. 415

చుక్కగముల నెల్ల నొక్కటొక్కటె కూడి
కలుపు చున్నవాడు గణిత విద్య;
దేవు డప్పుడములు తీసినా, వేసినా,
ఉన్న శేష మింక సున్న యొకటె! 416

మూడు మూళ్ళ గదులు; మూలల పరివారు;
నడుమ జేసివారు; నట్టనడుమ
పంచముఖము వాని పంచాయతీ తీర్పు
లేడ సున్న కడకు మూడయదులె. 417

సున్నబెట్టి యొకటి నెన్ని సార్లు గుణించు
కొన్నగాని మిగులు సున్న యొకటె;
సున్నసైన దాని కున్న యారజ మదే,
సున్నదనము మీద సున్నదనము. 418

పీదు పెదవి వంపు మీది గులాబికి
వచ్చి ఈ గులా మొసగె సలాము;
గుండె మీద పండుకొన్న మూడంకెకై
బ్రదుకు ఈ సలీము హృది హరాము. 419

•...•

## బావ పద్ధతి

భరతనాట్య మందు భంగిమల్ చూపితి;
వీణ మీటితిని కవిత్వ మందు;
చెప్పు మిందు నాదు తప్పేమి? అక్క! నీ
రసికరాయ డట్లు పసరమయ్యె. 420

తప్పు లెఱుగనంచు తలుపు మూసికొనంగ
నిజము కూడ బయట నిలిచిపోయె;
నీ నిజానిజాల తోనేల? బావ! ర
మ్మవ్వసుఖము కోరి ఒప్పుకొంటి! 421

ధర్మశాస్త్ర మందు తప్పని యున్నచో
కన్నె ముద్దు తప్పు గాదటంచు;
స్త్రీల సభను పెట్టి చేయింతులే, బావ!
సవరణలను- ఇంక చంపకయ్య! 422

మఱిదిగారు! మీరు తరవాణి కుండలో
నీరు త్రావలేదు;- నిమ్మకాయ
కోసికోషులేదు;- కొఱుక లేదును కిళ్ళి
ఎట్లు వచ్చె పెదవి కెఱుపు? పులుపు? 423

మొగము మీద వంగి, బిగియించుకొనె రైక;
కాలు జాఱి మీద తూలిపడియె;
ఒంటివాని చేసి సొంటి పిక్కను పెట్టె;
మొద్దుబావ పట్టి చద్దికుండ; 424

అన్న దెవరు? నిన్ను దున్నపోతని- వారి
హెచ్చుదేమి?-నీకు లొచ్చుదేమి?
బావ! వారి కంటె నీ వెంతయో నయ
మ్మెడ్డితనమె కాని గడ్డితినవు. 425

బావ! నీవు నన్ను బ్రతిమాల బోకుము,
పట్టుకోకు కాళ్ళు; పైకి పైకి,
ఒంటిదాని చేసి, అంటింపకుము నాకు,
ఏచ పైన పసుల నేర్పు లెల్లి! 438

చీర యెత్తి నాను; బారాబజారులో
నల్ల యిరికిదా, యనంగ, కలికి
ఎంత కెత్తినావె? ఇంతి! ఎట్లున్నదే
ఎత్తి చూపు మనియె, క్రొత్తబావ- 439

తుమ్మెదా! వయస్సు కమ్మదనము తోడ
మత్తు గొలుపు పూవు మఱదలి మది
తెక్కు కొసల నీకు నెక్కున్న చాంచల్య
మెఱుగ జాల కున్న దింతయేని. 440

పండ కుండ బట్టి దండుగ మఱదలి
పొలము; మేము బ్రదికి పోయినార;
మదియె పండియున్న పెదబావ సాగుతో
మునిగి యుందు; పిల్లముండ నేను! 441

నీకు నాకు మధ్య రైక లేటికి? కోక
చేప కంప నటు గిరాటు వేయ,
తడిపి వేసె వాని దాసి; నీ ధోవతి
చుట్టుకొంచు నేగుచుంటి బావ! 442

భర్త లెంద ఱున్న, బావకు సరివచ్చు
మధురవస్తు వొండు మహిని లేదు;
మగువ లెంద ఱున్న, మఱదలు సాటిది
మధుర మధుర నిధియు మహిని లేదు. 443

***

# అత్త పద్ధతి

అన్నమెల్ల నిచట నైపోయె సంకటి
పలుకు పదును నానుబాయి కాగ,
అనలదేవ! ఇంక అత్తగారి మొగమ్ము
పడలి రాగదయ్యొ' వంటగదికి. 444

ఆద్దె నత్త కనుల కపరంజి మొహికీలు,
కట్ను మారు వేలు క్రక్కె మామ;
మంకుపట్టు మాను మింక కూతురికోస
మేడ నుండి తెచ్చు నెడమ కన్న? 445

వచ్చి, జఱుగలేదు వడసార మొకనెల?
నూరుచున్న దపుడె వీరకత్తె
కోడలమ్మ మీద గొడ్డళ్ళ గుండ్రాళ్ళు
చేయ రమ్మ! సతికి చేతబడిని. 446

అత్త ఉట్టి మీద పుత్త సందుకొనంగ
చంక లెత్తి యెత్తి సాయ మడుగు;
కూతు కన్నుదోయి కొలికంచు లయ్యెబో.
అల్లు డందమైన పిల్లవాడు. 447

కలిపె నత్తగారు ఘాటుగా పులిహోర
అబ్బురమ్ముగ వచ్చె నల్లు డనుచు,
మొదటె దూదిబొమ్మ, ముద్దు కూతురు; దైవ
మడ్డు పడిన, ప్రేమ గ్రుడ్డిదగునె! 448

బోను వంటి ఇల్లు మేనత్త గారిది,
రాధిగాడు వట్టి రాలుగాయ,
నెత్తి నోరు పెట్టి మొత్తుకొన్నను నీవు
వినక పోతి విప్పు డనుభవించు. 449

‘అక్క లేక లేదు!’ ‘వాకిలి కేడకు
తెడ్డ సంగ తెచ్చు గడ్డపలుగు;
పెట్టె పెట్ట ముసుగ. కట్ట గైకొని వచ్చు,
అత్త గారి చెవిటి మొత్తుకోళ్లు. 450

బిడ్డ పాప లేని గొడ్డుమోదు పడుచు
పుత్రిపోయు నేల అత్తగారు;
కొడుకు చేటపెయ్య; కోడ లేడకు పోయు
అరువు తెచ్చు నందు కెపుడు పోరుగు. 451

“ఊపలేదు వాడు, గోదారిలో బడ
పోయినాడు, నీదు పోరు వలన;”
“అత్తగారు! మీరు పాడిలిపో బవిలేమ,
పెద్ద భయము పతికి చేవ లవ్వ.” 452

అన్న మన్నమంచు, ఆకలాకలి యంచు
సోలిపోవు నన్ను చూడగానె;
ఎదుట కంచమున్న మెదుకైన ముట్టి దే
మయ్యె? పతికి తెల్పె దత్తగారు! 453

అత్త లేని కోడ లుత్తమురాలని
లోకవాక్య గాని నాకు పడదు
వేయి అత్తగార్ల పెట్టు నా శ్రీవారు
ఓర జాతనేని నూరుకోరు. 454

అత్తగారు నీకు, అమ్మగా రగునాకు;
ఆమె కొలిచివోసి వంతసుఖమొ,
అపురనెడు నాకు ఆహార మైనచో
బ్రదుకలేనె; వినవె! బ్రతుకలేనె. 455

*.*

# గాథా పద్ధతి

కోడి గ్రుడ్డు లోన కునుకు ప్రాణపు మంట,
పెనము క్రింద మండు పిడకవంట--
వానకతుపు దాలి లోవి ఆకలి మంట;-
కౌపను గొంతుకోత కొక్కొ-కొక్కొ. 456

వెనుకనుండి వచ్చి కనులు మూసినదుష్టి,
భర్త చేత కతన నమూర్తి యనియు,
శర్కరాకటంపు శాస్త్రిణీ యనిపలెన్—
ప్రేమపూజ పూల కేమి లోటు? 457

నీవు కూడ నెపుడొ ఆపినై పోవుదు
వనుదు శాస్త్రవేత్త లందు రిప్పు
నవి తటాక మధ్య నవహసించె- వినియు
చెరఢ వినవలైన యూరకుండె. 458

ద్రాక్షపండు నంత దయమాలి యొత్తకు
కొజికి వేయ కోసి కుండరదన!
పండు కండ ఖండ ఖండమ్ము లగుచుండ
జెదర సాగె; నాదు పెదవి కూడ. 459

ఎత్తు చెట్టుకొమ్మ నెక్కి- కూర్చున్నావు;
నవ్వుచుంటి విట్లు నన్ను చూచి;
వేళ యయ్యె నింక కాకు లూగించక
రమ్ము! దిగుము! నా యురమ్ము పైన. 460

జోజో! జోజో! నాన్న! జోజో జోజో బాబు
నిదురపోర కన్న! నిదుర పోర!
అబ్బ! లాగకండి! అబ్బాయి నిద్రపో
నీండి! అదిగో! ఆర్పకండి! దివ్వె. 461

“స్నానమేదె, బావ! త్రిసంధ్య స్నానము చేయు
చుంద. గడివి మారుచుంటి విస్తు;”
“ఉంచుమ కేశవాడ! పెరుపులో సాయంత్ర
మునుము సంజ గొప్ప కొంచమేని!” 462

చీర నడుగ చేసె చెప్పుటో' నైకమ్మ
పొంగ సాక్ష్య మిచ్చి తొలగునేమొ!
కాని, బుగ్గమీది గంపైల్లితెల్పక
మాన వింక, ఉన్న మాట చెలియ! 463

పథకము వేసినావ' మధురాపురము దాక,
పచ్చిరాడ! నమ్మతసరసి దాక,
ఎప్పుడు వచ్చి కన్న నేడంకెనే చూపు
మగువ మానసంబు మైలుబాయి. 464

మలి గులాబి రేక మాటువెట్టిన తెల్ల
మల్లె మొగ్గ లతివ పల్లవరుస.
పువ్వు బోడి విపవు నవ్వు మాత్రను క్రమింగి
చచ్చిపోయినాడు పిచ్చివాడు' 465

భార్య లేనియపుడు పతకింటిలో వంట;
వంట యింటి ఆమె ఇంటనున్న;
కాని యెడల కంది; ఐనచో నారిగె
క్రొత్త వంట లక్ష్మి నిత్తెపంట. 466

“రాజుగారు మీకు నాజూకు నాజూకు
పచ్చసిల్కు చీర పంపినారు!”
“చీర తెచ్చినట్టి వారె కట్టించు టా
చార మంచు మాకు వారెజుగరా!” 467

***

## రసాభాస పద్ధతి

ఆమె మేనకిరాణి ఆతడా, చుంబింప
ప్రేమపెండ్లి కైన నేమిఫలము?
పొడుగు డాక్టరయ్య పోగాటతో నామె
పిక్కలెల్ల తీరె నొక్క విగిసి. 468

గేదె కంటె పెళ్ళి; ఊడె సన్నాయి. నా
గిలము; పప్పుకొట్టె చెలమ కప్పు;
కన్నుగొట్టె నామె దుష్టపోతుకు చూచి,
పిచ్చి యెత్తి మరుడు వచ్చినాడు. 469

ఒడ్లు విండిపోరు ఉదక మైనను కుక్క,
నాల్క తోడ గతుకు నాకి, నాకి,
మదపుటేన్గు నదికి ఎమకేదు, తొండావ
పీల్చు, వెల్చు, నద్దికల్ పెమర్చు. 470

ఆమె పాదరసమె ; ఆతడా చవ్వీక్లె;
ఇంకజాలి యొకటి; ఇంకు నొకటి;
కరుడు గట్టి మంచుగడ్డగా నతడయ్యె,
చుక్క వోలె రసము చిక్కె నడుమ. 471

ఎంత చిన్నదోమ? ఇంత రాగము దీసె;
మొగము నెల్ల మూసె; ఎగిరి ఎగిరి;
చిక్కదయ్యె చేత; చిక్కగా వతికించె
చెంప వాయ ముద్దు చెంపకాయ! 472

మనసు లోని మంట మానిని దైనచో
దాని నార్పు తెఱగు నే నెఱుగుదు;
వరములెల్ల చితుకు నలి చేసికొనిమందు
నాదు గుండె మంట కేది దారి? 478

వేసవంటె తమల పాకయ్యెనని కాంత
వెల్లబోయె నేల? వెఱ్ఱిదాన?
ముప్పు తిర్పుదేండ్ల మొగుడింక సరిపడ్డ
అరువదేండ్ల ముదుక దాని భర్త! 474

అట్టి పెద్దమాట లగు టబద్ధము గాక;
అశుభము శుభము నెఱుగ నట్టిదాన!
హడలు గొలుపు హాస్య మాపక డాక్టరూ
కనులు విప్పి, చూచి, అను మదేదొ! 475

ఆమె గుండెలోని ప్రేమనగర మెల్ల
కప్పురంబు పోలె కాలిపోయె;
ఇంక ఎన్నియెన్ని లంకాపురంబుల
నగ్గిసేయ నుండె నగ్గిపుల్ల! 476

ప్రేమ అడవి లోన పాములు, తోడేళ్ళు,
కోళ్ళు, ఎద్దు, గ్రుడ్లగూబ లెన్నొ
వలచి, వలచి, ఓటువడెగాని, గాడిద
మక్కువ వొకటె చెలికి తక్కువయ్యె. 477

''కదలి వైతి వపుడె కన్నీళ్ళతో; నిన్ను
సూట్టుకొనక ముందె ముద్దుగుమ్మ!
భూతపతినొ? దున్నపోతునో! కోతినో?''
''ఆర్యపుత్రు చేది దైన నదియె!'' 478

గోపురమ్ము వంటి కురుయున్నచో, సింగ!
పెట్టవచ్చు పూలు బుట్టెడైన!
ప్రోవు చేసినావు, పూలిన్ని; ఎన్నాళ్ళ
కెదుగు నోరి! సింగి ఎలుక తోక. 479

ఇరుగు వారి కోడ లెసిమిడింటికె చీర
మడుపకొని పరుండు పడక మీద;
మత్తు గొలుపు చుండు నత్తరు వాసన,
లెట్లు సాగునో! పరీక్ష లింక. 480

మగని తోడ నున్న, మగనాలి తన ప్రాత
మగని గూర్చి ఎపుడొ పొగడు చొప్ప;
రాత్రి పడుక మీద రావోవు మగవి దా
ర్ఢ్యమును మెచ్చుకొనుట అనుచితమ్ము. 481

అప్పిరా 'ప్రియుండ' ఎద్దు తోకకు గల్గు
బుద్ధి యైన నీకు పుట్టదేల?
కటిక చీకటైన కనజాలు తగుచోటు
పసువు సైతము పొరపాటు పడదు. 482

అతని కెంత; యామె కది చాల; దతనికి
ఆమె కున్న దేదొ అదియెచాలు;
అరువు బేరములును, చిఱుతిండ్లు హరియించు
కొనెడు శక్తి లే దతని కొకనికె! 483

రమణి రైక లెల్ల రతిరాజె కుట్టినా
డెడమ కంటె కుడిది హెచ్చుకొలత!
కారణమ్ము మీరు గాలింప పనియేలే
దొంటి చేతివాడు యువతి మగడు. 484

వర్ణ భేదములును, వంశవేధలు లేవు;
మతము మీద మాకు మమతలేదు;
నరుల జాతి యేని నల్లివి కావుగా?
చేవ గలదె? తీపి చావుకొఱకు! 485

***

# తిమిర పద్ధతి

ముదిత నిదుర కనులు ముద్దుతో మేల్కాంచె,
అధర మందు తేనె లదరసాగె;
కొట్టుకొనియె బిట్టు గుండె తప్పెట వోలె,
నవ్వులనున్న మగని తలచె మనసు. 486

నాల్గు చేతు లాట నాతి యాడగ బోవ,
ఆఱు కాళ్ళ చేతు లాఱు నయ్యె;
ముండదైవ మింక రెండె యేర్పఱచునో,
మూడు తలలొ సతికి ముందుముందు. 487

పైట గూటిలోని పక్షి పిల్లల బట్టి
తివురు నరకిరాత! తిమిరవేళ,
నిదుర వోవునట్టి విసుగుల లేపకు
ఎగురు నెట్టు; లెఱక లెదుగలేదు. 488

గట్టు మీద నేదొ కాలిచప్పుడు వించు
భయము నొంది లేచె బాపనమ్మ;
"నిను తలారి రాము డనుకొంటి తహసీలు
దార!" యంచు తిరిగి కూరుచుండె. 489

కన్ను గొట్టుచున్న పిన్నకుంకలి కండ్ల
మనసు దీర్చుచుండ, వెనుకనుండి
భళి! సెబా వటంచు పతిదేవు డరుదేర
కాక వయన యయ్యె ఘూకనయన. 490

అరుగు వెనుక నున్న విరజాజి పందిరి
క్రింద నెడమ కొత్తిగిలి పరున్న
గోడ నొంటిగంట కొట్టగా కవ్వించు
అంధకారమం దరుంధతియును. 491

హరిహరి! నినుదప్ప నన్యొ నెఱుగనంచు,
పతికి చెలియ చేయు దాసకెల్ల
పంప మడుగు నుండి మక్కపై పొడిచిన
ప్రేమ కాక దాఖలా లికేల? 492

ఎఱుగ నెఱుగ నంచు ఏడ్చి ఏమి ఫలంబు?
ఒప్పు చేయ దుక్కి లాడిపడునె?
మరులు వేడిగాలి; మరువాక దమ్మాంబు;
మగువ; పిలువ వమ్మ! మంత్రసాని. 493

ఎత్తు మత్తు చూచి ఎవ రనుకొన్నదో!
జరిగె నేమొ దాని కిరులె సాక్షి!
బాధపడెడి దెవరొ వాడుండ, తానుండ,
లోక మేం చేయు కాకిగోల? 494

అతివ బిగువు చూచి, ఆతిథ్య మిచ్చెనో
బలము చలము గలుగు బ్రహ్మచారి;
తాన బలము నమ్మి, తానొప్పెనో భర్త!
దైవ మేమి చేయు? తప్పెవరిది? 495

దొంగపొత్తు గోరి లంగోటి ముడి చించు
కొన్నవాడు, రేచుకుక్క నోట,
వెట్టి వదినె ముందు వీరాధివీరుడై
కోయుచున్నవాడు కోతలెల్ల. 496

గొంతు లేవ కితడు గుసగుస ప్రశ్నించె
కలడె డాక్ట రింటి కడ నటంచు;
"లేరు! రండి! లోపలి" కటం చతని భార్య
నడిచె తలుపుదీసి పడుకగదికి. 497

నాకు విసిమె జబ్బు నా భార్యయే దాని
నాపక పుట్టించు వనియె వైద్యు;
వైన నా చికిత్స కామె కెప్పుడు తీరి
కానునా! తెల్పు మనుచు నడిగె రోగి. 498

బండకాయి నౌచు పడ సహల్యను కాను;
పాప శాపములకు భయము పడను;
పై బరువ్వు వాడెవండో నే నెఱుగనా!
గొంతు చించుకొనకె కోడిపుంజ! 499

సెట్టిగారి సుతను పట్టిక తురక ద
య్యమ్ము పీర్లపండు గైసకాని;
వదలిపోవనంచు బెదిరించు తెఱుగడౌ!
ఏం వచ్చె నల్లు డింతలోనె? 500

నల్లి చీర యామె నాభార్య యనుకొంటి,
తప్పుతప్పె దాని కొప్పుకొంటి;
ఆఖరైనదాక అట్లూరకొని ఇప్పు
డామె ఒప్పుకో దిదేమి వింత? 501

నిదుర నటన చేసి తుదియంచు గనుమేర
కీడె సుఖపయోధి పేదరాశి;
కిర్రుకిర్రు నడికి గుఱ్ఱు మేల్కాని వచ్చు
అప్పు బడితె పూజ తప్పదయ్యె. 502

వెన్ను దట్టుచుండె కన్నీటిలో పాప;
గుండె మెఱుముచుండె కొఱవి మొఱిపె
కడచిపోయినట్టి అడవులం దెచ్చోట
తన చరిత్ర నామె దాచుకొనునొ. 503

కరగిపోయె; సంజ కరులు పేరగసాగె;
గూళ్ళ పక్షులెల్ల ముసుకసాగె,
నీలికలువ తాను నెలవంక కోసమై
ఎదురు చూచుచుండె హర్షమునను. ౫౦౪

గెలుపు నీది; ప్రేమకలహమ్ములో నోవ్రు
కొంటి; లోకమెల్ల నొంటివాని
చేసి నన్ను చిత్రచిత్రవధల చేయు
చుండ నూరుకొనెదె? చండి! కనుచు. ౫౦౫

చంపి పుట్టె చుక్కసానుల నెల్ల నీ
కంటిచూపు వాలుగంటి! నన్ను
అంజనమ్ము వేసి అమవసలో ముంచి
ఏ ఫలమ్ము నొంద నెంచినావు? ౫౦౬

తురక వాని వెంట త్రోలి వేసిరట, నం
బూద్రి వారి పిల్ల నిద్రలోన
తప్పు చేసె నంచు దానిచే నగుశిక్ష
మగువ కయ్యె నొక్కొ! మగని కొక్కొ! ౫07

అతను డొకడు చంపె నబలను దినమెల్ల;
నతను డొకడు వచ్చి చంపెరాత్రి;
నందె వేళ కాకముందె పోగైతి వీ
వెవడవయ్య ముసుగు హవుసుకాడ! ౫08

ఇన్ని చందమామ లున్నను-ఒంటరి
నాకు మార్గమెల్ల చీకటయ్యె!
చుక్క లొక్క టొకటె లెక్కపెట్టుచు నిట్లె
బదుకు నెల్ల గడపి వైచినాను. 509

కలం లోన పిన్నికాయంతో వాడు
కొనగబోమె పుణుకు మసక వెల్గి,
ఎలుకజాడ మాత్ర మలమారు తలుపుపై,
గ్రోయుచున్నవాడు, మోర్సుకోళ్లు ౫10

వనధిలోన చేపకును దప్పిచే గొంతు
కెండి పోయినట్టు లుండు నతడు;
అహరహమ్ము పనియె మహిళాసమాజము-
లోన; రాత్రి దిండు పైనసాము. ౫11

ఆశ నిల్పుటద్ద మందు చీకటి లోన,
నన్ను నేనె చూచికొన్నవాడ!
నన్ను నన్ను నుండి భిన్నతం జూపెడి
వెలుగు కంటె చీకటులె నయమ్ము. ౫12

నన్ను మ్రింగినట్టి నీలిచీకట్లను
మ్రింగు చుండు ననియె మెఱుగుపుర్వు;
గౌరవంబు నీదె ఖద్యోతమా! యంచు
నవ్వుకొనియె లోన నలినసఖుడు! ౫13

ఒక సిరామరకకు ఒకనాడు ప్రాణమ్ము
వచ్చె; గుండె దడయు హెచ్చె; కలము
కలల యల్లికలనె కాళిదా సగుపించె;
విచ్చె కలలు; మచ్చ చచ్చిపోయె. ౫14

రంయి మనుచు లేచె రామబాణము మీద,
క్రీడి శరము మీద దాడిచేసె;
తగిలినట్టి చోటె తన లక్ష్య మన్నది;
గ్రుడ్డివాని చేతి దుడ్డుకఱ్ఱ! ౫15

***

## స్మృతి పద్ధతి

చెట్టు నుండి వ్రేలు మట్టి దుత్తను నింపి,
మూత తీసి, లోన చేత పడిపి,
పసిడి పళ్ళ వెదకు కొసవెళ్ళి కన్నాని
పొక్కిపండ్లు విక్కి పుట్టింపవె! 516

తోరణమ్ము కట్టినారు "యువాసువా
సో" యటంచు నీవు చదివినావు;
మంత్రముల ద్విజోత్తమా! చెప్పుమిటు వివా
హమ్ము' చేసినాడ వపరకర్మ? 517

'ప్రాణమహిమ యేమొ! పొడిచెను, నాడించు,
నాస జెంచు నున్న ముపుతు మేన;
అంత ప్రాకులాడి అంతలో ఏమియు
నెఱుగ నట్టి విడిచి, ఎగిరిపోవు' 518

మిత్రి మొహరు తోడ నుత్తరా లెన్నెన్నొ
ప్రకృతి సంచి తీయబడుచునున్న
వీయ బడుచునున్న వే చిరునామా కొ;
ఇచ్చువా డెవండొ? ఎఱుగరాదు 519

డాక్టరయ్య వ్రాసె తావున్నర చికిత్స
మందులయ్యె గుంజె వంద లైదు;
డాబుసరిగ వచ్చె టాక్సీలు, రిక్షాలు;
లలిత కయ్యె దిక్కు తులసి నీళ్ళు; 520

కాటుక విష మద్ది కంటి చూపుల ఛురుల్
గ్రుచ్చి నంత మాత్ర చచ్చిపోయె
నంచు తలప బోకు మమృతకుంభము లందు
ఇల్లు కట్టికొనియె; యుల్లమతివ! 521

మిణుకు మిణుకు మనుచు, మిణుగురు పురువట్టు.
కన్నుగొట్టుచుండె కల్ల బ్రదుకు
బిగిసి, బిగిసి, బిగిసి, దిగలాగుకొనుచుండె
చారుసత్వ మైన చావుత్రాడు. 522

సకల జూచు; నాతి నగుమొగమ్మును చూచు,
జగతిజూచు: జనుల పొగరుజూచు;
అన్ని చూచి చివర కాకాశమునుజూచు
వెళ్లకిల బడుండి వెఱ్ఱికనులు. 523

వచ్చు వారు పోవువారు వేనకువేలు;
కానరాడు నిలువ గలుగువాడు;
పూవు పూచు బిడ్డ పుట్టు గుమ్మము మీది
తోరణమ్ము లోనె కారుచిచ్చు. 524

పాట లోనె కలదు పాటకు మృత్యువు
పాడబడిన దింక పాడబడదు;
బ్రదుకు లోనె కలదు బ్రదిమికి మృత్యువు,
బ్రదుక బడిన బ్రదుకు బ్రదుక బడదు. 525

బ్రహ్మరథము నెక్కి, పంగనామాల్వెట్టి
కాటి కేగినాడు; బోటిమగడు;
శోకజలధినెల్ల నౌకలో దాటింప
బొడ్డి సిద్ధమైరి; రెడ్డిగారు. 526

వెన్ను పాము బట్టి వ్రేలాడు మరణంబు
పాఱ ద్రోలె నీదు ప్రణయమహిమ,
మృతి రుచించునన్ను బ్రతికించితి వదేల?
మృతికి మఱొక మృతియు నతుకనేల? 527

•••

527వ పద్యము -

ఇందలి నాల్గవ పాదమే పద్యమంతటికి జీవగఱ్ఱ. అనంగదశలలో కడపటిది మరణము. నాయికపై విరహబాధచే నాయకుడు మరణాసన్నుడైనాడు. అమృతమహిమ కల నాయిక ప్రేమశక్తి వలన, అతడు విరహమరణమునేకాక, వెన్నుపామును పట్టుకొని నిత్యము ప్రేలాడు సహజమరణమునుకూడ ఉత్తరించి అమర్త్యుడైనాడు. నాయిక విషయమున నాయకుని మనస్సులో రేగిన మనస్సంఘర్షణ తప్ప ఇందులో నిజముగా జరిగిన ప్రకృతి వైపరీత్యమేమియులేదు. 'మృతి రుచించు నన్ను బ్రతికించితి వదేల' అను మూడవ పాదములో 'కోరుకొనుచున్న మృతినుండి నన్నేల తప్పించితివి' అను నాయకుని ప్రశ్నలో అతనికి అవరోధమేదియో అడ్డువచ్చినదని ద్యోతకము కాగలదు. దానికి జవాబు నాల్గవ పాదములో కలదు. నాయిక మరణించినది. అయథార్థమైన తన మృత్యువుపై యథార్థమైన ఆమె మృతి అతికినది. ఆశలు తీరని ప్రేతాత్మలు బాణావతుల వలె గదిలో ఒకమూల తిష్టవేసికొని ప్రియుడు చనిపోవువఱకు కన్నార్పకుండ అతనినే చూచుచు కాలముగడపునని పేరాసైకాలజీ పరిశోధనలలో పేర్కొనబడిన విషయము. చిత్రమునందలి పుత్తికంటిలోనిబొమ్మ మరణించిన ప్రియురాలు. ఆమె దృష్టిచే ఆకర్షింపబడుచున్న ప్రియుడు క్రిందిఛాయాపురుషుడు. ఒకరిది మృతజీవనము. ఇంకొకరిది జీవన్మరణము.

**సూచ్యార్థము :** ఇక్కడ నాయికా నాయకులు– ప్రకృతిపురుషులు. వెన్నుపాము అనగా కుండలిని, సంస్కరింపబడిన మనస్సుచేత కుండలినీ వ్యుత్థాపనమై సహస్రారమును చేరి మనస్సులయము కాగనే సాధకుడు జనన మరణములనుండి ముక్తినొందును. అంతవఱకు ప్రకృతి బ్రహ్మముకంటె భిన్నమైనదనుకొని సాధకుడు మృత్యువునుండి మృత్యువునుపొందుచుండును.

మనసైవేద మాప్తవ్యం నేహనానాస్తి కించన
మృత్యోస్సమృత్యుం గచ్ఛతి య ఇహ నానేవ పశ్యతి.

కఠోపనిషత్తు– 2-4-11

# డీన పద్ధతి

వారఫలము నమ్మి పేరమ్ము పెట్టినా
పెరిగి పోయె వేలు; దిగె బజారు;
ఇంక దిక్కెక్కడందు? వెంకటేశుకు దక్క
కాని ఇమ్ము ముడుపు గట్టికొనగ. 528

పిల్లపాల కొఱకు బిచ్చ మెత్తగబోక
చావ గొట్టినాడు; సావుకారు;
గిన్నె డిండు నాకు గన్నెరు పేళ్ళ ర
సమ్ము నూనె గలిపి, అమ్మగారు' 529

చిదుకు లేరి తెచ్చి చిన్ని జెల్లల వేచి
బిడ్డ లందఱకును పెట్టినాను;
ఎట్టు లుడుకునమ్మ! కట్టెపేడును లేక
పెద్దచేప ఇంటి పెద్దకొఱకు; 530

జీత మందు నోట్లు చేతముట్టికొనంగ,
ఉలికిపడు నదేమి పిలకగాడు;
వేడి పాల నోరు మాడిపోయిన దింక
ఊద ఇట్లు? త్రాగుచున్న చల్ల! 531

కనులు చూచు, చెవులు విను, వాని పనులవి
చేయుచుండు, సద్దు చేయకుండ,
తినుట తప్ప యేమి యొనరింప కీ పాడు
నోరు మాత్ర మేడ్చు భోరుమనుచు. 532

ఎంత చీకుచున్న, ఎండు బొమికె నుండి,
తడియు పొడమ దయ్యొ పొడియె కాని;
ముడుసు తాకి నాల్క వెగలు రక్తమొ, రస
మ్మంచు కుక్క చప్పరించు నౌర! 533

మనసు మీద మంచు కొండ కరిగి పోయె
విగ్రహమ్ము నేను విరిగి పోయె;
గిన్నె నిండ నింపి కన్నీళ్లు పిగ్రావి,
దప్పి దీర్చుకొంటి దుష్పునాత్మ' 584

కూలివాని చేరి చూడి మొగముపైన
రగులుచుండు ఘోర రక్తవహ్ని;
వట్టి బ్రదుకు బ్రదుకు దొడ్డ ఖజానాల
జూడి యగుచునుండు పేదచితులు. ౫౮౫

పొట్ట కెల్ల నాయగట్టి, పేదల కాయ
పులను త్రిత్రి చేసి, కొలిమినూడె,
కాల్చె తాను పండి కన్నీళ్ళు, యంత్రంబు
కొలిమి లోని ఇనుప గొలుసు వండి. 586

ధనమదమ్ము తోడ కనులు పోయిన యట్టి
ధనద జనుల క్రూర దాస్య మనెడు
కలుపు మొలిచినట్టి పొలమైన బ్రదుకెల్ల
దుక్కి పలదె పలయు సన్న ఫలము, 587

మన్ను తినెడి వాని కన్నీళ్ల కడలిలో
పుత్తడి తినువాని నెత్తురెల్ల;
చుక్కచుక్క కూడ చక్కగా కరిగిన
కాక, కలదె శాంతి లోకమునకు! 588

విశ్వ మెల్ల ప్రాణ విభుని మందిరముగా
తనరు పేదవాని మనసునందె
ధనికహృదయ మందు కణము కణము కూడ
ముళ్ళకంప; వట్టి కుళ్ళగోయి. 589

•...•

# వైరాగ్య పద్ధతి

కంటె' చెలియ కైన ఘాతుకమ్మేను నేడు
మింట నూగులాడు మేఘసఖుత
కార్చి పొమ్మె రెండు కన్నీటి చుక్కలు;
ఎదద లేదు నాకు తడి యొకింత. 540

పుట్టు మొదలు కాటి గట్టు మెట్టెడు దాక
గద్దె పదవు లందె గడపినావు;
తుదకు మంట లందు దుమ్మైతివా' రాజ
ఏమి ఫలము? జగతి లేదె గుఱుతు? 541

నాటి కథ లవెల్ల నాటి తోడనె తీరె;
నే డదేల? వాదులాడుకొనగ?
ఇంక మీద చెలియ! ఈ ముద్దె హద్దుగా,
మనుడు, మమ్ము మఱచి మగడు నీవు. 542

పసిడి పంజరాన పాయసాన్నము కంటె
అడవి లోన ఆకు నలము మేలు;
రాణి కొప్పు మీద రత్నంపు రవకంటె
కెంపు దమ్మి నీటి తుంపు మేలు! 543

కనుల లోన కనుల గలిపి చూడకు నన్ను;
పాపి మరుని నిదుర లేపబోకు;
వారి వీరి మాట వేతేల! మా వారె
పాతి పెట్టగలరు; గోతిలోన! 544

మనసు లోని కనులు నిను జూడగా నంగ
లార్చుచుండ, ఎమటి కరుగుదెంచె;
ఒక కబోది, అతని యుల్లంబున జగమ్మె
కన్ను-నాదు గ్రుడ్డికన్ను గంటి' 545

చిక్కనైన గాలి యుక్క రంధ్రము లందు;
కాపురమ్ము చేసి కైపు గూర్చె;
మనసు లోని నీడ మాత్రమే కొండలు
ఉబ్బ రెక్క తిరిగె నుప్పుపోలె. 546

పెంచికొన్న తపమె పంచన బోయును;
మనసు కూడ తనను మాయచేయు
మగువ మాయ సేయు; మనిషి మాయలు సేయు,
మాయ సేయు తరణి మండలంబు. 547

సరస మెఱుగ నట్టి సన్యాసి యొక్కండు
వనయు మాంస మదియె వనిత తనువు;
అతని గన్న యట్టి యమ్మకు బంగారు
వెండి యదయమ్ము లుండె నొక్కొ? 548

సోకు లొలుకునట్టి రేక లన్నియు విచ్చి
నవ్వుకొనుచు నుండు పువ్వుకన్నె;
మాన లేదు వలపు లీనుట పరులకై
కంచు గ్రోచ్చు మెడను గ్రుంచుచున్న; 549

ఎవ్విధమున నెంత కవ్వింప బడినను
మనసు దగ్గ ఱుంచుకొనుట మేలు'
మగువ కైన మేటి మగవాని కైనను,
కాలు జాఱిపడుట చాల తప్పు. 550

పడతి చుంబకాగ్ని బలవత్తరమె యైన
ధ్యేయవస్తు వొక్క స్త్రీయె కాదు;
కలవు జగతి లోన కవులార! మీ కైత
కర్హమైన జీవితాశయములు. 551

*...*

## మాతృ పద్ధతి

తల్లి కారణముగ పిల్ల కార్యంబౌను,
పిల్ల కారణముగ తల్లియౌను;
ఎంచి చూడ నెవరి కెవరు కారణ మౌను
పున్నతనము లోనె సున్నతనము. ౫౫౨

రసము లెల్ల కలవు ప్రకృతిగర్భము లోన
మహితమైన దొకటె మాతృరసము;
క్రౌర్య ధైర్య శౌర్య కరుణాదు లవియెల్ల
మాతృరసము నందె ధాతృకములు. ౫౫౩

అన్ని దినుసు లందు కన్నతల్లి ఘనంబు,
కన్నతల్లి కైన చన్ను ఘనము,
చన్ను రిత్త గాక చాన పిల్లకు గాదు,
పిల్లగాక తల్లి తల్లిగాదు. ౫౫౪

ప్రేమ వెచ్చదనపు నోము నోవనిస్త్రీలు
తగులుకొనగ వలదు తల్లిదనపు
గోడు లందు, బిడ్డ ఏడుపు లందును,
స్తన్య విషయమైన తప్పులందు. ౫౫౫

తల్లి రసము తోడ తడియు నెత్తురు గ్రుడ్డు
జాఱ విడిచె మంత్రసాని తూర్పు
గ్రుడ్డు చితికి పసిడి గుండుగా జ్వలియించె
అదె యనర్ఘ వజ్ర మయ్యె త్రుటిని. ౫౫౬

అడవి లోన అడవి; అడవిలో అడవిలో
అడవి లోన అడవి; నడుమ నొక్క-
చెట్టు లోని చెట్టు; చెట్టులో చెట్టులో
చెట్టు లోని చెట్టు చిన్న విత్తు. 557

••

# అదృష్ట పద్ధతి

తీయ తీయ నైన తేనె మాటలు; గోటు
కోర మీసకట్టు, ఓర చూపు
చిలిపి నవ్వు చూచి కంకంద వసుకొంటి
నన్ను మోస పుచ్చె నామనసు. 558

కౌగిలించి, విన్న కవ్వాన చిలికించి,
కోడె వయసు సీట తోడుపెట్టి,
అమృత ఫలము నంద నాశించితిని కాని
నన్ను మోసపుచ్చె నామనస్సు. 559

వసుధ లోన గల్గు పసిడితో వెండితో
తీరిపోవు; గొప్పవారి బ్రతుకు-
వెండి పసిడి కొండ లుండినన్ కొనరాని
పైరు కుప్ప కొద్ది వారి గొప్ప. 560

మగడు కొంచుబోయె మరువమ్ము దవనమ్ము
మఱది కొంచుబోయె మల్లెపూలు;
పొరుగు వాడు తెచ్చె బూందీ పకోడీలు;
ఎవని భాగ్య మెటు ఫలింప గలదొ! 561

మరులు గాలి సోకి మా ఇంటిలో రాల
వలసి యున్న మగని వాస చినుకు,
పోయి పోయి పోయి పొరుగింటిలో రాలె
ఎండె నిచట; పొలము పండె నచట; 562

కార్తికంబు నందు కదురంత ఉంటినా,
మాఘ మందు నాదు మహిమ చూడు
డన్న దెవరొ! దాని కన్న వారే దాని
చిక్కు విప్పి కనుడు, చిక్కు నొకడు. 563

పుట్టి వెడలి వచ్చి అట్టిట్టు బంగరాకు
మెలికె త్రిప్పు సాగె ఎలుకతోక;
పట్టి లోని కిచ్చె, పాము, ఏమో వావి
నల్లి పువ్వు కనులు; తెల్లవడియె. 584

కలికి పెదవి మీద గానమ్ము వలె, యౌవ
నమున లేత కోర్కె నవలు దావెగె;
పాట మాట వేల; ప్రారబ్ధ ఫలమట్లు
గదికి సిద్ధమయ్యె, గాడిదయ్యె! 585

వలపు నూనె వోసి, వెలిగించుకొని దివ్వె
నెలత పొలములెల్ల నెమక బోవ;
మేత యయ్యె నవతి ఈతి బాధకు పంట,
మంచె గానదయ్యె మగని ఎడద. 586

పచ్చవనము చూచి పనస ముందనుకొంటి,
చేత ముట్టి దోవ చిత్ర మయ్యె;
ఉడుపు బరువు కరిగి ఉమ్మెత్త కాయయ్యె;
ఆముదంపు కాయ అదియు కరగి. 587

గాలి సోకి లేచు కాల్వ అలల దేలు,
ప్రమిద కలలు పేదవాండ్ర తలలు;
లేమి నోట జిక్కి రెపరెపమను దీప
కోరకములు, వారి కోరికలును. 588

అదియె గొంతు! నడక అదియె; ఒయ్యారమ్ము
లవియె; కన్ను సైగ లవియె; ఉడుపు
లవియె; పూవుపొదలు అన్నియు నవె కాని
ఈ నిశీధి భాగ్య మింకొకరిది. 589

నడుము పొంగి, కొంచె కదలి, క్రిందికి జారు
చచ్చినట్టి కోటి జనుల లోన
ఒక్కడైన పున్నె మొనరించు కొనడొకో!
ఎల్ల వారల మయ్యె పల్లెకాడు. 570

పడతి చేతి లోని వడిసెల జాయిగా
తిరిగి తిరిగి తెగె నదృష్టరేఖ.
ఎగిరి గాలిలోని కెదు రేది వచ్చునో!
పాప మెఱుగ నట్టి పక్షులందు? 571

వీడి వండి వడ్డె నెలత నవ్వెన నేమి?
గుండె యెల్ల నాకు మండిపోయె;
బూది నెల్ల బొక్కి బొక్కి యాకలి దీర్చు
కొంటి; చెఱకు నమలె పంటవాడు. 572

బొంది తోడ మోక్షమున కేగు నాసతో
నీటిలోన మునిగె నీటిబుడగ;
అమ్మతల్లి' ఎంత ఆస పుట్టెనె యంచు
నీటితల్లి పైకి నెట్టివైచె. 573

పూలు కోసికొంచు పోయె చాకిరి పిల్ల
ఆకు మేసిపోయె మేకపిల్ల,
కోటికి వేసె చిగురుకొమ్మ పిచ్చికపిల్ల,
త్రుంచి వేసె వేరు చుంచుపిల్ల' 574

బుగ్గ సొట్టలందు పొంగు పాలుగ నించు
బోడి నవ్వె నాన తోడు పెట్టి;
కవ్వ మట్లు చిలికె కాంతుని మదినెల్ల;
వెన్నపూస తీసి కొన్నదొకడు. 575

అతడు పుష్టినాడె, ఐశ్వర్య ముండియు,
ఇడియు నడియు బిచ్చ మెత్తువాడు,
పరుల నడుగకుండ బ్రదుకంగ గలవాడు
పేద యయ్యెఁ దా కుబేరసముడు. 576

పుణ్య మెంత చేసి పుట్టెనో! నూలు పో
గులును నిన్ను గొలుచు ఫలము గాంచె;
పాప మెంత జేసి ప్రాపించితినో జన్మ
రైక కున్న, సుగతి నాకు లేదు 577

అన్న మన్న మంచు ఆర్చి ఆగము చేసి,
చచ్చిపోవునాడు ఒప్పగాడు
రొట్టె కొసలు తెచ్చి పట్టెడు వేయవే!
పీనుగయ్యె, దయ్య మౌను కూడ! 578

ఒడలి కొడలె తావి; ఒడలి కొడలె వన్నె,
ఒడలి కొడలె నిండు పడుచుతనము;
రంగు, తావి, పరువు, రవికాంతు లేకమై
అరుగు దెంతు వెవరి వమ్మ! నీవు! 579

ఘనత కొఱకు మంచుగడ్డగా రూపొంది
కొండ తలను మంచు కులుకసాగె;
చేయి సాచి ఇనుడు స్పృశియించి నంతనే
పడియె కరగి, జాఱి, పదము మీద 580

మనసు తీట గీకికొను పద్యముల హాయి
తీట గోకినట్లె తీయనగును;
అరుచిరోగి, చెవుల నవి భస్మ మగుచుండ
గోకు మండినట్లె గీకుమందు. 581

*...*

## రాజనీతి పద్ధతి

కాచి నీయ గలవు నోటి హుంకారమ్ము,
ఓట్లు దెచ్చిపెట్టు నోట్లకట్ట;
రక్ష నీయ గలదు రౌడీల మద్దత్తు
ఏమి తెచ్చు మనకు వేమనయ్య? ౯౮౩

కడుపు తరల కంటగట్టి వేపాక మాట
తోచ నీయకుంటె దొరతనమ్ము;
పొట్ట నిండ తిండి పుట్టెనా! క్రొవ్వెక్కి
తిరుగుబాటు చేయుదురు జనమ్ము! ౯౮౪

అసలు బ్రదుకు రూప మర్థ మైనది నేడు
పూతలోక రాజనీతి వలన;
యమపురమ్మునకు మహారాజ మార్గమ్ము
చీమజారు పైన చెప్పుకాలు. ౯౮౫

చెవిటి గ్రుడ్డి రాజు చేతిలో పక్షిగా
మనిషి బ్రదుకు నేడు మంటగలిసె;
ఈక ఊడదీయు తోకను తెగలాగు;
దాని గోడు బ్రౌఝ్యొ లోని పేడు. ౯౮౬

లంజెఱికము సేయు, రాచ లచ్చిమి, దొంగ
నోటు మరల తెరల మాటునందు;
అడ్డుకొనుట వలన అప్రతిష్ఠయె గాన
ప్రభుత కూడ మఱిగె పడుపుకూడు. ౯౮౭

దొంగపనులు చేయ దోషసంకోచమ్ము
ప్రభుత కేని లేదు; ప్రజల కేని,
దొంగ వాని చూచి దొంగన్న వానినే
పట్టుకొంద్రు; చావ గొట్టుచుంద్రు. ౯౮౮

ప్రజల మూర్ఖులంటె ప్రభువుల స్వప్నాలు;
ప్రభువు స్వప్న మందె స్వార్థరథము;
స్వార్థరథము పయిని జనుల భవిష్యత్తు
వహ్వారే 'ప్రపంచ పాతకమ్ము' ౫౩౯

సున్నమునకు గూడ పన్ను పెట్టించెడి,
తెలుపు గలిగినట్టి దీనజనుల
ఎముక గూళ్ళ చూడ్డ మిది లోకసభ గమ్మ
ములకు పూసికొనుడు; ముగ్గులిడుడు. ౫౪౦

అచట గలవు భ్రూణహత్యలు, లంచాలు,
చిత్రవధలు; స్వార్థ మూర్తి విధులు;
అదియె రాజనీతిగది; దాని తలుపులు
మఱచి పోయి కూడ తెఱవవలదు. ౫౪౧

మింటి కేగుచున్న మంట నెవ్వరివంటి
ముక్తి సమర వీర రక్త మేఘ
పూర్వజన్మ మందు; పొలిటీషియన్ల దా
హమును; నేటి జన్మ మందనె నది. ౫౪౨

మాయ చేసి, తలకు మసిపూసి, మారేడు
కాయ చేసి, ప్రజల వాయినొక్కి;
అఱవు లఱచి, స్వర్గ మఱచేత చూపించు
గారడీయె, రాచ దారి నేడు. ౫౪౩

రాచకమ్మనగ నరాచక మ్మనియును,
సూనృతమ్మనంగ, నవృత మనియు,
తగ్గె ననగ హెచ్చు ధరలని పాలక
యమనిఘంటు పుటల నర్థ మిపుడు. ౫౪౪

చెమట నోడ్చి బ్రదుకు శ్రమజీవి జిహ్వాగ్ర
మున, మొకద్ద మనెడు ముల్లుగ్రుచ్చి,
పనులు చేయు, ప్రభుత పంకాల గదులందు,
మిండతనము' లంచగొండితనము! ౫౯౫

దొరతనంపు గదుల ధూళియు పైబడి
కట్టలందు, తాను కాంచు కలలు
భంగపడుట వలన బ్రాందీలు విస్కీలు,
మంచముకు సుఖమ్ము లంచమడుగు. ౫౯౬

తఱిమి వేసినారు; తమ డెందముల నుండి
పాలకులు ప్రజాళి బాధ్యతలను;
ప్రజలు కూడ త్రోసి వైచినచో నింక
పాప; మెటకు బోవు బాధలేని? ౫౯౭

లెండి! ముందుకిక పదండి!! దూకండంచు'
చబుకు బట్టి ప్రభుత జబురు చున్న
ఒక్క నరములైన నక్కగుజ్జాలు తా
మున్న కడనె గెంతు చున్నవహహా! ౫౯౮

ఒక ప్రభుత్వమునకె ఉన్న తలల్ మూడు;
లంచగొండితనము, వంచనయును,
అంతు పంతు లేని అధికార దాహంబు,
జనులె తమకు మొండె మనును తలలు. ౫౯౯

శ్రామికునకు వాని శ్రమఫలితమ్మును
దక్కనీని గుత్తదారు ప్రభుత,
కోట గోడ లెల్ల ఖోటాకుబేరుండు
కుళ్ళగించె, పందికొక్కు వోలె. ౬౦౦

శిక్ష లేని దుష్ట పశుల నేలిక
పాలనాధికార పదవు లిచ్చె;
పాలు పిఱిగె నంచు గోల వెళ్ళైదు ప్రజన్
కాలదండపహతుల జోలబడె. 601

ఇజము లేదియైన, నిజమున కొక్కడే
గీటు రాయి; ప్రజకు నోటి నిండ
తిండి; కట్ట బట్ట; ఉండ నిల్లియూదె
మనకిపుడు నభస్సుమంబు లయ్యె. 602

లంచగొండితనము లైసెన్సు తంత్రాలు,
దండశాసనాలు; బందమనసు,
చచ్చు దాక ప్రజల పుచ్చిపోవిచ్చుట,
దొరతనాని కయ్యె; పరమనీతి. 603

తినెడి నోళ్ళు హెచ్చెనని హడావిడి సేయు
చేయ గలిగినట్టి చేతులకు ప
నేమి చూప గలిగి నామని ఏడ్పెడు
ధరల తలపోలమ్ము, దొరతనమ్ము. 604

ప్రభువు లనుసరించు పద్ధతు లానాడు,
భయము భక్తి. గొలిపె ప్రజలయందు;
ధరణినేత లందు దైవభక్తియు, ప్రజా
సేవయును ప్రభుత్వ శీలమగుట. 605

భయము భక్తి లేని పద్ధతుల్ ప్రభువులే
నాడు ప్రజకు నేర్పినారు; నేడు
తగిలి ప్రజలు వాని తమపై ప్రయోగించు
చుండ, నుడ్డుగుడుచుచున్నవారు. 606

•••

## ప్రజా పద్ధతి

ధరల దారుణమ్ము భరతదేశమ్మనే
కాదు; జగతి నెల్ల కాల్చుచున్న
దనుచు, దొరలు చెప్పినను మూర్ఖజనులకు
కడుపు తప్ప వేఱు కానబడదు. 807

చాలినంత లేదు, చక్కెర రష్యాకు;
కాయగూర లేదు గల్పు ప్రజకు;
జనుల కడుపు మంట చల్లార్చుకొనుటకు
చాలదొక్కొ: బొటన వ్రేలు మనకు. 808

అదియు నిదియు మెసవ మని చెప్పి రుపవాస
ములను చేయ మనిరి; పొదుపు చేయ
మనిరి; దొరలు; హితవు లొనరించు మాటలు
ప్రజకు నచ్చకున్న ప్రభువు తప్పె! 809

తినెడి వారి కేని, తినని వారల కేని
కఱవు లేదు; కాటకమును లేదు;
తినుట చేతగాని దేబిరిగొట్టుకే,
కఱవులైన, కాటకమ్ములైన. 810

ఉభయ మీయకున్న అభయమ్మె దొరకదు,
దొరకు నభయమందు ధూళి సగము;
తలను కత్తిరించు తలపైన గలవాడు,
నడుము కత్తిరించు, నడిమివాడు! 811

సర్వభక్షకత్వశక్తి గల్గిన యగ్ని
హోత్రునకు క్షుధా నియుక్తి కలదె?
రేగెనేని, రోదసీగోళముల భస్మ
సాత్కృతమ్ము చేయ జాలు నతడు!!! 812

ప్రజను కల్గు సర్వభక్షక శక్తి న్నొ
ప్రజలు మఱచి నట్టి ప్రభువు మఱచె
రాజుచున్న యగ్నితో జెలగాటమ్ము
లాడ సాహసించు నజ్ఞుడతడు. 613

వంచనయును, ధనము, వాగ్దాన ఘోషణల్
మణులు నౌషధము లగ మంత్రములుగ
మనుజ మారణాగ్ని మంట బోకార్పగా
జాల వింక నెల్లకాలమునకు. 614

బ్రదికి యున్న చావు, బ్రదుకుతో యుద్ధంబు,
చేయుచున్న దిపుడు వేయిగతుల
కదనభూమి యొకటి కాలాబజారు; రెం
డవది, రాజకీయ నాట్యశాల; 615

సులువుగా లభించు చోరీ వలన దొంగ
నోట్లవలన్, బందిపోట్ల వలన;
లంజెఱికము వలన, లాభాలు; దైహికా
యాసమునకు నెవ్వ డభిమతించు? 616

పాలు చౌక చౌకగా లభ్య మగుచుండ;
పశువు మేప నెవడు పాటుపడును?
రూపయౌవనములు రూపాయికి లభింప
భార్య యుఱి కెవండు పాలుపడును? 617

అమరలోక మైన నణగారి క్రుళ్ళి దు
ర్గంధమలంసమ్ము కార్చగలదు;
క్షణము సేపు నేటి సంఘవైతరణిలో
నాని, పొందె నేని, స్నానసుఖము! 618

గట్టిగానె వేగిరపట్టి పకోడీలు
మంద ప్రజలు ప్రభుత వింద లడుగ;
పస నెఱింగి నట్టి రసికుడు కొక్కిచే,
సెక్సు రుచియు వారిసెక్సు రుచియు. ౬౧౯

అన్యదేశములకు అవినీతి ఉన్నదే
కాని మనకు గాంధి కావలెనది;
అన్యదేశముల మహౌన్నత్యమో ' మన
కందరాని పగుట అవసరంబు. 620

బాపుజీని రూపుమాపిన గాడ్సె యొ
కండె కాదు భరతఖండమందు;
అతని బోధ దీప మార్పెడుగాడ్సేలు
వేనవేలు గాంధి వేషధరులు. 621

కులము, గౌరవమ్ము, బలమ్ము, నైశ్వర్యమ్ము
ప్రాపకమ్ము, కీర్తి, పలుకుబడియు,
భయము, భక్తి, గూర్చు భవ్యచింతామణి
వహి నొకండె కలదు మంత్రిపదవి. 622

పచ్చి దయ్యోనేని పట్టించుకోరంట;
దోచ దయ్యోనేని బారువెబ్బ;
గట్టి దయ్యోనేని కాలవైద్యమ్మిట్లు
పలల వ్యాధుల కగు ప్రభుచికిత్స. 623

ధనికుడును దరిద్రు డను రెండు వర్ణముల్
పూర్వపునాల్గు వర్ణములను మ్రింగె;
ధనిక పొలిటీషియను లేకమై నేడు
పేద వాని కాడు పేర్చినారు. 624

భరతజాతి మహా భంగపాటునకును
వేఱెవరును కారు కారణంబు;
బొజ్జ నింపుకొనెడు పొలిటీషియనె దేశ
దారుణముల కెల్ల కారణంబు. 625

ఆత్మకీర్తిబుద్ధి, ఆత్మవైభవసిద్ధి,
ఆత్మవాంఛాసిద్ధి, ఆత్మవృద్ధి;
అనెడి హరులు లాగు మన పొలిటీషియన్
రథమె భరతమాత ప్రగతిరథము. 626

ఇతర దేశ వాసు లేమనుకొందురో,
యనెడి నెగ్గు సిగ్గు లైన పడదు;
చిన్ని పొట్ట తనదె శ్రీరామరక్షగా
ఎంచుచుండు ప్రజలకెల్ల నతడు; 627

పైన గుడ్డ లోన పాలిటిక్సు, గృహాన,
భార్యముద్దు లోన పాలిటిక్సు
పాఠ్య పుస్తకాల పాలిటిక్సు, హోటేలు
టీల లోన గూడ పాలిటిక్సె! 628

సగటుప్రజకు గల్గు వగచాట్లు తెగుబాట్లు
తిండిలేని తనము, బండతనము,
మందకొడితనమ్ము మందతనమ్ములే
పొలిటీషియనుల పచ్చగడ్డి! 629

చెప్పగలదు చరిత జిన్నాకు తులదూచి
భారతమున శకుని పాత్రధరుల
పసిడిపండు వంటి భరతధాత్రిని శ్మశా
నముగ చేయు క్షుద్రనాయకులను. 630

***

## ఛాత్ర పద్ధతి

రాజ భక్తి లేదు; రాజభీతియు లేదు;
దైవభక్తి లేదు; దైవభీతి.
సంఘభక్తి లేదు; సంఘభీతియు లేద
రాచకమ్మె యుపతకమ్ము నేడు 643

బ్రదుకు దారి చూప పనికివచ్చినది నేటి
విద్య యనుట ప్రజకు విదితమగును;
అట్టి విద్య నేర్చి సట్టి కళార్థి హ
తాశ కూడ ప్రజల కర్థమగును. 644

కాని నేడు జరుగు కాలేజి కిల్లోల
జీవితమ్ము లందు భావి పౌర
వీరులైన యట్టి విద్యార్థుల మనః ప్ర
వాహగతులు బోద పడవు ప్రజకు 645

కష్టపడి బట్టీ తన్నించుట, పరీక్ష
చీటి చూచి వ్రాయు చెడ్డ పనిని
పట్టుకొన్న గురుని బట్టి బాదుట
ఛాత్ర జాతి చూపు క్షాత్ర మగునె? 646

రాక్షసత్వ సరణి రాగింగు దక్కింగు,
మూక బలము చూపు స్ట్రైకింగుల గతి
లేకి దనమె చూపు స్ట్రీకింగులును, నేటి
ఛాత్రజాతి చూపు క్షాత్ర మగునె? 647

కన్నె పిల్ల జడను కత్తిరించుటయును,
చీర బ్లేడ్లు పెట్టి చించుటయును,
ఒంటి దాని మీద దంట చేతయు నేటి
ఛాత్రజాతి చూపు క్షాత్ర మగునె? 648

గోడ చాటు నుండి గుండ్రాళ్లు విసరుట,
చాప గొట్టి పారిపోవుటయును,
లంచ మిచ్చి ఫస్టుక్లాసు గొంటయు, నేటి
ఛాత్రజాతి చూపు శాస్త్ర మగునె! 649

నేడు ఛాత్ర శక్తి ఈ దేశ్ప గలయవి,
దొరతనమ్ము చేత కొఱుక బడని
యవియు, జనుల కెల్ల నవసర మ్మైన స
మస్య లెన్నొ కలవు మనధరిత్రి. 650

కల్తి సరుకులును, దగా వర్తకమ్ములు,
గొడ్డు ధరలు, లంచగొండి తనము,
లనెడు నాల్గు శత్రులను హతమార్చుడీ!
ఛాత్రశక్తి నిజము' శాస్త్ర మగును. 651

మందిరమ్ము నల్లె మర్యాదయును, భక్తి,
కీర్తిహోత్రము నల్లె వెలుగు, శ్రద్ధ,
విద్య గలుగు విశ్వ విద్యాలయములలో
సహజ శీల విధులు ఛాత్ర తతికి. 652

పొలిటికల్ పిశాచి మూక కమ్మడు పోవ
కుంటయును, కళాశాల యోగ్యమైన,
శీల ధనము వృథగ చెడనాడు కోకుంట
నేటి ఛాత్రతతికి నియత విధులు. 653

భరతమాత పరువు బాజారులో పెట్టి
అమ్మివేసినారు; స్వార్థపరులు;
వారి యాట కట్టి గౌరవమ్మును నిలుప
శక్తిలేదు; ఛాత్రశక్తి దక్క!! 654

....

## నీతి పద్ధతి

జనుల శక్తి కంటె తన శక్తియే హెచ్చు
గా దలంచి నట్టి గర్వపోతు
నిక్కునొకడు; వాని నీచమౌ గతి గాంచి
నీతి నేర్చుకొనుడు నేతలెల్ల. 667

ప్రజకు ప్రభువు కంటె బాంధవు డికలేడు;
ప్రభువునకును లేడు ప్రజలకంటె;
ప్రజల భక్తి బదులు వారి క్షుదాగ్ని ర
గుల్ప జూచు ప్రభువు కుత్సితుండు. 668

ప్రకృతి బాధ కైన, ప్రభుబాధ కైనను
కార్చనందు మీరు కంటినీళ్లు;
జనన మొంద గలవు శ్రమజీవులార! మీ
కంటినీట భూమి కంపనములు. 669

మెతుకు దొరక కేడ్చు మీ యమాయిక మైన
శ్వాస లందె ప్రభువు లాస పలువ
లార వేసినారు; వారి యాసల తీగ
పుచ్చవలదు; మీరు చచ్చిపోయి. 670

ఎల్ల దిశల యందు ఎఱ్ఱని చీకట్లు
బలిసి యున్న విపుడు, భరత ధరణి;
వాటి మీద వల్లకాటి చిత్రాలను
గీయ కింక స్వార్థ నాయకుండ! 671

నెత్తు రమిసెనేని, నెత్తిపై లాఠీలు-
కఱవు పుట్టె నిన్ను కఱచె నేని-
గ్రద్ద లాడె నేని కన్న బిడ్డల పైన-
గుండె దిటవు వీడకుము బికారి! 672

బొజ్జ పెంచుకొన్న బుద్ధపుంజులు సంఘ
రక్త మెల్ల త్రావి బ్రదుకుచుండ,
పేదవాడ! నీదు స్వేదమ్మయిన నీవు
త్రావి మనిషి బ్రదుకు బ్రదుకలేవె! 673

భయము పడును ప్రాణి బలవంతునిం జూచి,
లెక్క చేయ రెవరు బక్కవాని,
ప్రభువు లైన కూలి పనివార లైన ఈ
మంచి మాట జ్ఞప్తి నుంచుకొనుడు. 674

నేటి సంఘమందు, నూటికి తొంబది
పాలికాండ్రో లేక కూలివాండ్రో;
బిచ్చగాండ్రో, లేక పచ్చి దొంగలో, నిరు
ద్యోగి జనులో, కపట యోగివరులో. 675

అన్న మన్న మనుచు అఱపు లార్చెడు ప్రజ
నేడు బ్రతికి రేపు నీల్గు చుండ్రు;
అన్న మడుగ కుండ మన్నికగా నుండు
విగ్రహాలె మేలు వీధులందు. 676

తిండి లేక యనకు డండర్నరిష్మెంటు
చావు లింగిలీషు చావు లవ్వి;
మతివిహీను లైన ప్రతిపక్షు లవ్వాని
కఱవు చావులంచు అఱచుచుండ్రు. 677

జనుల ఘోష లెల్ల వినబడుచున్నను
ప్రభుత చెవిటి నిద్ర నభినయించు;
గుఱ్ఱువెట్టుచున్న కుంభకర్ణుని లేప
లంకలోని ప్రజలు జంకినారె? 678

*...*

# ప్రగతి పద్ధతి

ప్రగతి ప్రగతి యంచు ప్రగతి నామక ఘోష
నేటి కాల మందు నోట నోట,
కలము, కలము నందు, కాలేజి గదులందు
ఊకకు లెక్క వచ్చె విలువ వోలె. 679

ప్రగతినామ మంత్రరటనంబె ప్రగతియా?
ఆచరణము కూడ అందు కలదా?
ఆచరణము కూడ అందున్నచో దాని
రూప మెట్టులుండు లోకమందు? 680

భరత మాత కయ్యె ప్రగతి ప్రసవ మంచు
పొట్ట కోసి కనిరి పుట్ట వ్రణము:
వ్రణము లోన కనిరి వంచగొండి తనాలు
క్రిములు ప్రాకు రాజకీయములను. 681

ప్రగతి కేవలముగ వ్యష్టి సంబంధియా?
అది సమష్టి పరము నగుచు ప్రజకు?
వ్యష్టి లేని దగు సమష్టి రూపెట్లుండు?
ఏ సమిష్టి కేని ఏది కొలత? 682

ప్రగతి జీవితమున బాహ్య సంస్కారమా?
జనుల కంతరంగ సంస్కరణమ?
ప్రగతి యనగ భాగ్యవంతుని బానిసా?
ప్రగతి ఫలము బీదలకును కలదా? 683

ప్రగతి యనగ మాడు పైన పిచ్చుకగూళ్లా?
గజ్జిగీత చూపు గంట ప్యాంటా?
చెంప లెల్ల మూయు చింపిరి తలజుట్టా?
ఊసులాడు త్రాసు మీసకట్టా? 684

ప్రాత మీద తిరుగుబాటే ప్రగతిరూప?
ధ్వంసనీతి యొకటె దానితెరువ?
నేటి సంఘమందు ఘాటు సమస్యల
విషమతకు జవాబు విప్లవంబ? ౪౮౪

ప్రాత చింకి పాత, పట్టి లాగితిమేని
తునుక తునుక లగుచు చివిగి పోవు;
భూత కాల మనెడి భూతరూపానికి
కండగాని ఎముక గాని లేదు. ౪౮౫

చంద్రలోకమునకు జనుటయు ప్రగతియే
అణువు బాంబు కూడ నగును ప్రగతి
ధరణి ప్రజకు దేహధారణావసరమ్ము
లెంతవఱకు దీర్చు నంతవఱకె. ౪౮౬

ప్రతిదినమ్ము నందు ప్రతిచోట ప్రతిజీవి
గర్భ చిత్తికి శాంతి కలుగు నట్లు
తిండి తాను పరులు తినగల్గు జగతినే
ప్రగతి పూర్ణమైన జగతి యంద్రు. ౪౮౭

నేటి సంఘమందు ఖోటాతనము, దేహ
మలసిపోవు నేమొ యన్న భీతి,
సుఖపదమ్ము వంటి సోమరితనములే
ధ్రువ పదమ్ము లయ్యె యువతరమున. ౪౮౮

మఱుగు నెత్తులోన తరవాణి కుండలు,
పందతనము, నల్ల మందుతనము,
ప్రగతి మార్గమునకు ప్రబలమౌ శత్రువుల్
వాని రూపు మాప వలయు మొదట. ౪౮౯

# ఉపసంహారము

ఉలసీ పోతి సి ుసనంతరంగ బుపై
నాట్య మాడీ యాడి నాథ అప
నీదు నన్ను నాట్య మెదుట కూర్చున్న నీ
మాష్త, మిడుత ఎదుట దీపపుట్లు. 703

కొండ నెత్తి పయిన గొగ్గులున్న నవేల్లి
కొండ మెయికి కొమరు గూర్చు నవియె;
బాల కొలకు పరుడు త్రవ్విన గని గోయి
గాయమట్లు కొలువు గలపరమ్ము. 704

వంటే కుండ తుంబు తంత్రులు బిరికీలు
పీణ తనువు దృశ్యమాన జగతి;
దాన నడగియున్న గాన సౌలభ్యమే
భావవేద్యమగు వభావ జగతి. 705

“పరాంచిఖాని వ్యతృణత్స్వయంభూః
తస్మాత్పరాజ్ పశ్యతి నాంతరాత్మన్.”

తానె బ్రహ్మ మగుచు తనదె జీవాత్మగా
కావ్యరూపు డగును కవివరుడు;
కావ్యరూపమునకు కవికుందు సంబంధ
మరయ గల్గి నంత వఱకె జగతి. 706

సమాప్తము